చిరుతల

# కనకతారనాటకము



కాపీరైటు 1958 వెల 1-0-0

# చిరుతల కనకతార నాటకము

తిప్పాయపల్లెపై అంకితముగలది.

గ్రంథకర్త:
వేముల లక్ష్మిరాజం
తిప్పాయపల్లె

卐

పరిశోధకులు:
చెర్విరాల భాగయ్య గారు



ప్రకాశకులు:
కొండా శంకరయ్య
బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్
సికింద్రాబాద్ (దక్కన్)
బ్రాంచీలు:— హైదారాబాదు & వరంగల్.

1958

 [వెల 1-0-0

# పాత్రధారుల పట్టిక

## పురుషులు.

సూత్రధారి
ఉదయసేనుడు
సుబుద్ధి
క్రూరసేనుడు
లుబ్ధుడు
వీరశూరులు
కనకసేనుడు
దొంగ
జయసింహుడు
సుకీర్తి
యోగిపుంగవుడు
భటుడు
బెస్త బోయిలు
రాంజెట్టి
మేఘవాహనుడు
ఉజూరు
న్యాయవాదులు

## స్త్రీలు.

నటి
విమలాదేవి
చెలికత్తె
తార
బెస్త పోచి
సత్యాబాయి
పద్మాబాయి

# చిరుతల కనకతార నాటకము

## గణపతి ప్రార్థన.

దర్వు॥ శ్రీ గణపతి యెపుడునీకు। శరణుజేతు బ్రోవుమయ్యా। యోగివినుత యేలుమయ్యా। జాగుసేయబోకుమయ్యా। సాగిలబడి మ్రొక్కుచుంటి ॥శ్రీ॥ విఘ్నరాజ నీవుసకల। విద్యలకది పతివిదేవ। విఘ్నహారణ అగ్రిజుండ। శీఘ్రిము మమ్మేలుమయ్యా। శివకుమార కావుమయ్యా॥ శ్రీ॥ యీధరతిప్పాయపల్లె। నిమ్ముగసవరించుమయ్యా। భాద్రపద శుద్ధ చవితి। భక్తితోను గొలుతుమయ్యా। భాగ్యములొనగూర్చుమయ్యా ॥శ్రీ॥

## సరస్వతి ప్రార్థన.

దర్వు॥ శ్రీసరస్వతమ్మ నీకు। శరణు శరణు బ్రోవవమ్మ। వ్యాసులాది మునులునిన్ను। వరుసగబూజించిరమ్మ। యీ సమయము నీకునేను దోసిలొగ్గినాడనమ్మ। వాసిగ నాకికకవియతి। ప్రాసల యొనగూర్చవమ్మ। భాసురముగ యీధరతిప్పాయపల్లె వాసివమ్మ। దాసుడునె వేడులక్ష్మో రాజము నేలగదవమ్మ ॥శ్రీ॥

## సూత్రధారి ప్రవేశం.

దర్వు॥ యెంతమోదమూ। భళి। యీసభాంతరంగముగన॥యెం॥ వింతగ బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు శూద్రజనంబులు। సంతోషంబున యిచ్చట। సభగావించినవారలు ॥యెం॥ పండితులును కవిగాయక। భాగవతోత్తములును ఘన। మెండుగ యీసభ సుజనులమండలి యుక్తము నుండిరి ॥యెం॥ పాటిగతిప్పాయపల్లె। పోలుపొందగ పాలించెటి। హాటకచేలుని సత్కథ। హాయిగ వినగోరిరి బల్ ॥యెం॥

వ॥ ఆహా! యీ సభాస్థలి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాది జనంబులు పూర్వుల వృత్తాంతంబులవినగోరి విచ్చేసియున్నారే సరి యొక పుణ్యసత్కథను వినిపించుటకై మత్కులసతియగు నటి నిందురావించి విచారించెదగాక,

## నటి సూత్రధారికి వాదం – దర్వు.

సూ॥ నటివిను సుగుణములపేటి। నీవిటురమ్మిక వధూటి। పటుతరముగు
సభగాంచియు। పరిశోధించగదె బోటి ॥న॥

వ॥ హే నటీ! గానకళావధూటి ఒకసారి నీవిటురమ్ము.

న॥ జీవితేశనను బిలిచిన । సంగతేమొవచియింపుమి । భావమలర విని యూరొుక । పనిజేయగ యోచించెద ॥జీ॥

వ॥ ప్రాణేశా నను బిలిచిన కారణంబెద్దియో వచింపుము.

సూ॥ కామినిమణి వినుపూర్వుల । కథ వినగోరియు సభికులు । ప్రేమతో వేంచేయనిన్ను । బిలచితి వచియించెదవని ॥కా॥

వ॥ ప్రియసీ యీ సభికులు పూర్వుల వృత్తాంతము వినగోరి యపేక్షించియున్నారు కావున నీవు ఆనందించునట్లు యొక సత్కథ యెట్టిదో యోచించి తెల్పుము.

న॥ నాథా మీరీవిధమున । నన్నడుగుట దోచదయె । నేతలుమీరై యుండగ । నేనెంతటి దాననయ్య ॥నా॥

వ॥ ఆహా! నాటక సూత్రధారి యను నామంబుగల మీరే మహా కళావిశారదులై యుండి నన్నేల యడిగెదరు.

సూ॥ కాంతరో నేయోచించితి । కనకతార నాటకంబు । వింతగ పతి వ్రతచరితము వినజేయగ నాయిష్టము॥ కాం॥

వ॥ మనోహారీ! పుణ్యచరిత్రమగు చిరుతల కనకతార నాటకను వినంజేయ నాయభిప్రాయము. నీ యిష్టంబెట్టిదో తెల్పుము.

న॥ సరెమెచ్చితి కనకతార । చరితమె సంతోషమయ్య । ధరశిలోప్పాయ వల్లె । ధాముని స్మరియింతునయ్య ॥

వ॥ మనోహరా! యీ చిరుతల కనకతార అతిసంతోషకరముగా నున్నదిగాని దానిని కృతి జేయించినవారెవరో వినంజేయుడి

సూ-వ॥ సరి అటులే వినజేసెదను వినుము.

సీ స మా లి క

శ్రీవిలసితంబైన జిల్లా కరీంనగర్।సిరిసిల్ల తాలూక చెలగివినుమా। సొంపైన గ్రామంబు చూడచోద్యంబనని । తిప్పాయపల్లెయం దనర వెలయు । భక్తమార్కండేయ గోత్రోద్భవులు భావ। నాఋషి వంశ సన్మాన పరులు । దోపతినర్సయ్య శ్రీపతిభక్తుండు । అతనిసుతు లిలసిర్వరతిహితు లును । వినువెంకటయ్యాయు ర్వేద వైద్యుండును । ద్వితియుండులింగయ్య ధైర్యశాలి । కామినీమణి వినుము । వేములనర్సయ్య । శంకరునిభక్తుడ

కలంకమతుడు।అవని తనసుతు లెన్న అద్భుతుండనవొప్ప। వెంకటనర్సయ్యా నామాంకితుండు । నారిద్వితియుడు లక్ష్మినర్సయ్యా నాముండు । కడుశాంతిపరుడనంబడును యింక । లక్ష్మిరాజము మిక్కిలాచారుడును వడ్ల । కొండమల్లయ్యా జ్ఞానుండు యతని । పుత్రులలో మిగుల పూజ్యుండు దయశాలి । శంకరయ్యా నెడు నామాంకితుండు । అధిక శాంతుడు మేర్గుఅచ్చయ్యా భువి యతని । సుతులలో ద్వితియుండు శంకరయ్యా । బలు సజ్జనుడు బొల్లబత్తిని నర్సయ్యా । రాజపూజితుడండ్రు రమణి యతని । సుతుడీర మల్లయ్యా సుజ్ఞానికడు భక్తి । శాంతచిత్తముగల్ల సరసుడింక । వినుబోగ నర్సయ్యా ఘనధైర్య శాలతని । సుతుడు హన్మంతు యాశ్రితహితుండు । రమణిచిల్కనుమంతు । కొమరొప్పతనయుండు । శ్రీహరింకను మిగుల శ్రేయుడవని ॥ వీరలందరు కీర్తి రాగోరి కనక । తార నాటకం చిరుతల దర్వులోన । రచనగావింప వేముల లక్ష్మిరాజం । నడుగ వ్రాసెను పొత్తంబు నబల వినుమా॥

న-వ॥ ఏమీ ! తిప్పాయపల్లె గ్రామనివాసులగు పద్మశాలి వంశోద్భవులు దోపతి వెంకటయ్యా లింగయ్యా యేముల వెంకటనర్సయ్యా లక్ష్మినర్సయ్యా లక్ష్మిరాజం వడ్లకొండ శంకరయ్యా మేర్గు శంకరయ్యా బొల్లబత్తిని వీరమల్లయ్యా బోగ హన్మయ్యా చిలుక శ్రీహరి వీరందరుగలిసి ఈ నాటకమును కృతిజేయించిరా సరి పుణ్యాత్ములు యింక తక్కినవారి నామధేయంబులు దెల్పవెందులకు.

సూ-వ॥ సఖీమణీ యిందుకు నుద్యుక్తులయ్యిన వారింతియే.

న-వ॥ ఇంక నెవ్వరేని సహాయకులున్నారా తెల్పుము.

సూ॥ సరి అటులే విన్నవింతును యిటువినుము.

సీ॥ శ్రీమంతులై మహాశ్రేయంబు విలసిల్లు । జంకె భూమురెడ్డి సత్యవ్రితుడు । రాజరెడ్డియు మిగుల రాజపూజితుడతని । తనయు వెంకటరెడ్డి కనకకడ్డి । రాజసాత్మ్వుండు నరెడ్ల కిష్టారెడ్డి । సుతుడు వెంకట నర్సింహారెడ్డి । కోరి తెల్పెదనింక దారము రాజరెడ్డి । మిగులగుణవంతు డిన దగును మరియు । గౌడకులములో కీర్తివడయ గోరినవారు । అన్నారం అన్మంతు తనయు డెన్న। నర్సింగమితశాంతి పరుడండ్రు అకుల । రామయ్యా దయగుణాకరసహితుండు । మల్యాలహన్మంతు మరియాదగలవాడు। యింక

దెల్పెద రజకులిండ్లలోన ॥ ఘనుడు నేరెల్ల నర్సయ్యా అనవరతము। పలికి బొంకడు తనసుతుండిలను బుద్ధి । శాలినర్సయ్యా వింటివా సన్నుతాంగి । వీరలందరు సహాయమైనారు యెలమి ॥

న-వ॥ అహాహాయెంత ఆనందకరము వినినకొలది యింకావినుటకు మనసు గోరుచున్నది సంతోషము.

సూ-వ॥ అటులైన యింకొక మన విటువినుము.

సూ-సీ॥ కామినీ వినుకొడిమ్యాల గ్రామనిలయు । డెన్నగను పద్మశాలి శ్రేయోన్నతుండు । నడ్లకొండ చిన్నస్వంతు వారిసుతుడు । పెద్ద దేవయ్యా సహాయ ప్రసిద్ధుడయ్యె ॥

సూ-వ॥ వింటివా కొడిమ్యాల నడ్లకొండ పెద్ద దేవయ్యా కుతూహాలముతో యిట్టి చరిత్రమునకు కొంత సహాయ మొనర్చెనుగదా యిక మనమిందు తడవు రాదు అదో ఉదయసేన భూపాలు డరుదెంచుచున్న వాడు. (అని నిష్క్రమింతురు)

ఉదయసేనుడు ప్రవేశం - దరువు.

ఉదయసేనభూపాలుడరా మృదు । హృదయుడ సద్గుణశీలుడరా । ముదమున రాజ్యంబును పాలించెటి । బుధమాన్యుడ సద్విభవుడగా ॥ఉ॥ సకలశాస్త్ర సంపన్నుడరా మహా । అకలంకుడ దిగ్విజయుడరా । సుకరముగను దీనజనాళిని మానకసవరించెటి కర్తనురా ॥ఉ॥ సలలితముగ మత్కులసతివిమలా । యిలపతివ్రత సద్గుణశీలా ।తలపగనాయొక సంతతి కూరిమి । తారకనకసేనులు వినరా ॥ఉ॥ కరమొప్పగ నాసోదరుడతి వి। క్రముడు కూరసేనుడుగదరా । ధరవెలసిన తిప్పాయపల్లె వారి । కరుణ గోరి యిటువచ్చితిరా ॥ఉ॥

వ॥ మంత్రీ ధీవిశారదా. మం-వ॥ మహారాజా.

ఉదయసేనునికి ధీవిశారదునికి వాదం - దరువు.

ఉ॥ క్షేమమేకదా । మనగ్రామంబున సకల జనులు ॥క్షే॥ భూమిసురాదిగ జనములు । యేమాత్రము కొరతలేక । సామజవరదునిమనమున యేమారక నున్నవారె ॥క్షే॥

వ॥ ధీవిశారదా మనరాజ్యంబున సకలజనులు క్షేమకరముగా యున్నవారలేకదా.

మం॥ భూమినాయకా! మీ కేమని తెల్పుదు నునేను ॥భూ॥ తామువినగ లేదా యిం! దాళ నేను జెప్పవలెనా ! తామసాత్ముడగు మీయొక్క ! తమ్ముని దుర్మార్గములను ॥భూ॥

వ॥ రాజేంద్రా మీరెరుగని దేమున్నది మీతమ్ముడగు క్రూరసేనుడు జేయు దుర్మార్గములకు లోకులు భీతిగొనియున్నారు స్వామీ.

ఉ॥ యిందులకై నే ! నేమందును నోరాడదాయె ॥యిం॥ యెందునగనివిని యెరుగను ! యిట్టి దురాత్ముని కన్నుల ! మందగుణముచే ప్రజలను ! మనసీయుడటంచుదోచె ॥యిం॥

వ॥ కావున యిట్టి నా మనోవ్యధ యెన్నడు దీరునో కదా.

మం॥ భూపవరేణ్యా ! మీరీపగిదిని కలతనొంద ॥భూ॥ పాపకార్యములు జేసెటి ! ప్రజలను దండించి వార్ని ! తాపసాత్ములుగ మార్చెటి! దైవసమానులు మీరై ॥భూ॥

వ॥ రాజచంద్రా మీరిట్లు దావంత పడుట నామది కడువిసుగుజెందుచుండెనుగదా.

ఉ॥ యీమహినేనూ! ప్రజలాముదమునుగోరి వాన్ని ॥యీ॥ యేమన్నను నిందపాలు ! యీమాటనిజముగాని వేరె! భూమీశులు విన్న మెచ్చ! బోరు ధీవిశారదయిక ॥యీ॥

వ॥ కావున ధీవిశారదా యిందులకై నామదిలో రాత్రింబవలుపరితపించుచుంటినిగదా.

మం॥ పుడమియందు నా ! తిప్పాయపల్లె హరికరుణయు ॥పు॥ బాడమునట్లు జరుగుమనము ! పరగ దెలుపజాలమయ్యా ! జడియనేల మీదుపాల జరుగనున్న దెట్టులోకా ॥పు॥

వ॥ రాజేంద్రా మీరు యీ విషయమై చింతిల్లుట పాడిగాదు ధైర్యంబు వహింపుడు.

ఉ-ఉ॥ తక్కువలేవు ధారుణి రథంబులు నాగములశ్వరాజముల్! మక్కువ సర్వభాగ్యములు మాకొనగూర్చె విధాతగానినే ! నెక్కువ గుందగా వలసె నీవిధిక్రూరుని దుష్టచేష్టలకా ! దక్కగ నేమిజేయుదము ! దాచక దెల్పుమి మంత్రిపుంగవా!

(అనినిష్క్రమింతురు.)

క్రూరసేనుడు ప్రవేశం దర్వు.

క్రూరసేనుడను భూరిపరాక్రముడ । మారసుందరా కారుడరా । మేరుసమానసుధీరుడ వీరుడ లేరురనాసరివారలురా॥ వింతగదోచిన స్త్రీల వలచినే । కంతుకేళిగూడక విడరా । సంతోషంబుననందు నెపుడు పర । కాంతలగోరి హరింతునురా ॥ సలలితముగ తిప్పాయపల్లెలో । పలవెల సిన హరికరుణచేరా । తలపునందు భయపడబోనెప్పుడు । యిలబలాఢ్యుడను యెంతైననునే ॥

వ॥ ధీరవిశారదా వింటివా నాప్రజ్ఞ, నేటిదినంబున లుబ్ధునికూతురితో గలియనెంచినాడగదా.

మం—వ॥ రాజేంద్రా యేల మీరిట్లు బలుకుచుంటిరి రాచకులంబున కిది మర్యాదేనా.

క్రూ—వ॥ ఛీ దురాత్మా నాకు విరోధివై పలుకుచుంటివా తొలగిపొమ్ము.

(అని వెడలించిన ధీవిశారదుడు ఉదయసేనుని జేరి.)

మం—వ॥ నరేంద్రా క్రూరసేనుని యిట్టి దుండగముల మానుమన్న నన్ను విరోధునిగానెంచి నెట్టించెనుగదా.

ఉ—వ॥ ధీవిశారదా! అవివేకులు నీతులు వినజాలరుగదా.

గీ॥ దుష్టగుణములు విడుమన్న తోచదతని । కెన్నిజెప్పిన వినడు నింకేమిసేతు । పిత్తములుగల్గు రోగికి బడునెతీపి । అందులకుమందు చెరసాల యందునుంతు ॥

వ॥ కాబట్టి యీక్రూరునిబంధించి చెరసాలయందుంచు కర్తవ్యముగదా.

మం—వ॥ రాజేంద్రా అటులే యొనర్చవలయును.

(క్రూరసేనుడు మరుగుననుండి విని)

వ॥ యేమీ! నన్ను చెరసాలయందుంచుటయా యింతవరకు మిమ్ము మన్నించియూరకున్నందుకా మీరిట్లు తలపెట్టుట యిక మీ ప్రాణముల దీయకమానను నమ్ముడు.

(అంతలో లుబ్ధుండను కోమటివచ్చి.)

ఉదయసేనునికి లుబ్ధునికి వాదం — దర్వు.

లు॥ తాళగలేమయ్యాయీ । ధారుణి యందున మేము । తాళ జాలమయ్యా మీ । తమ్మునిడు జేయుంగాను॥

వ॥ రాజేంద్రా మీతమ్ముడుజేయంగ యిక మేము బ్రతుక జాలము. (అని యేడ్చును),

రా॥ హరిహరి యిదియేమివింత । ఆశ్చర్యమదో చెనేడు ॥ త్వర గనువేంచేసియుందు । దుఃఖమొందుచుంటివేమి.

వ॥ లుబ్ధమహాశయా యిదియేమి మాతమ్ముడివలన నీకేమి కష్టముగలిగెనో వచింపరాదా.

లు॥ తెలుపుదు సెట్టులమీకా । దోషకారిదుడుకుతనము ॥ తలుపులూడదన్ని యెంతో । తగనికార్యమునుజేసెను.

వ॥ నరేంద్రా మీతమ్ముడుజేసిన దుండగముల జెప్పనలవికా కున్నది గదా (అని యేడ్చును).

రా॥ దుఃఖమొందబోకుమింక । దుండగముల పేరుదెల్పు ॥ గ్రక్కునవివెట్టి క్రూర । కృత్యములైనను వచింపు.

వ॥ దుఃఖించకుము అదెట్టి క్రూరకార్యంబైనను భయంబుజెందక సర్వంబును దెల్పుము.

లు॥ ఖండితముగ యింకవోర్చి । యుండగలేమయ్యా మేము ॥ యుండితిమింద్రాకచాలు । రెండోరాజ్యము బోదుము॥

వ॥ అయ్యా ఇన్నాళ్లనుండియున్నది చాలు యిక రెండోరాజ్యము బోయి జీవించువారము దేవా.

రా॥ యిదియేమీ అన్యాయా । మీరీతిగదలపోయుట ॥ పదపడి నేనడిగినట్టి । ప్రశ్నకుత్తరమునివ్వవు॥

వ॥ లుబ్ధ మహాశయా యిన్నిమారులు అడిగిన అడిగినప్రశ్నకుత్తర మిచ్చుటలేక యేడ్చుచుంటివిదియేమి.

లు॥ అయ్యో యికయేమనందు । యిచ్చోట మాయిల్లుజొచ్చి ॥ చయ్యనమాపుత్రినిరతి । సలుపగోరె బలిమిచేత ॥

వ॥ చెప్పకుంటె మానంబోయె చెప్పకున్న ప్రాణంబోయెనను నాకెట్లపలె మాబ్రతుకు (యేడ్చును).

రా॥ యింతఘోరకృత్యంబును । యెటులజేసె మాకు మాకు తమ్ము ॥ డంతలోమీరెచటికేగి అరుదెంచినవారో తెల్పు॥

వ॥ అట్టి తరుణమున మేము యెచ్చటికేగియుంటిమి.

లు॥ ప్రక్క ఇంటిలోపురుషుడని । పిలువ పెళ్ళి యుంటిమంత ॥ గ్రక్కునకూతలువినబడ । కదిలిప స్త్రీమంతకంత॥

వ॥ రాజేంద్రా నేను ప్రక్క ఇంటిలో పురుషుడనుగ పోయినా రము మాకుమార్తె యొక్క తెమాత్రిమే ఇంటిలో శిరోజములు దువ్వుకొను చుండెను అట్టితరి మీతమ్ములుంగారు వీర శూరుల వెంటనిడుకొని వచ్చి మాముద్దులకూతురిని మానభంగ మొనర్పదలచిన నది కేకలిడగా మేము బంధువులయుతము వచ్చి రక్షింపుడని మొరబెట్టిన వినువలేదు యెట్టకేల కెట్టులనో విడిపించితిమి పిమ్మట యొక దండము చేబూని మమ్మందర్ని మోదిన అందులో మాభావగారి కాలు విరిగినది మాతాతగారి నాశికము పగిలినది యిట్లు యింక నేకులకు గాయములునై మిక్కిలి యవస్తపాలై రిగదా,

రా॥ ధారుణియందున వెలసిన । తిప్పారియాపల్లీను ॥ కారుణ్యము గలదెటులో । కృపాసునివచించుటకు॥

వ॥ లుబ్ధా యికనీవు ఇంటికిబొమ్ము యాకృపాసుని నీఇంటికి రాకుండ జేసెదను నిశ్చింతగానుండుము.

లు-వ॥ చిత్తము యెట్లుజేసిన మీదయ యికనే బోవుచున్న వాడ. (అని వెళ్ళిన రాజు ధీవిశారదునితో).

రా-వ॥ అట్టి పాపిని యెట్లు శిక్షించవలయునో తెల్పుము.

మం-వ॥ రాజా పాపాత్ముల నెట్లు శిక్షించిన దోషంబులేదు గదా.

కృ-వ॥ ఒరే నీచులారా మీరేమిచేయగలరు నే టిదినమున మిమ్మె ఖండింపదలచినాడను గదా.

రా — ధీ — వాదం — దర్వు.

రా॥ యేమిజేతమూ । నేడిందులకై యాలోచన ॥యే॥ కామ క్రోధలోభియు బహుగర్వాంధుడు కృపాసెను । గ్రామస్తులకలకలపడ । గాజేసెనుయింక మనము ॥యే॥

వ॥ కావున ధీవిశారదా ప్రజలక్షోభంబులు జూచుచు నేనెట్లు భరింతును.

మం॥ మానవనాథా । యామార్గము నాకెటుదోచదు ॥ మా ॥ కానున్నాకార్యంబిల । గాకతీరునేరంజిల । గానేటికిమీమనమున । కావున ధైర్యమునుంచుడి. ॥మా॥

వ॥ రాజేంద్రా నిండమునిగినవానికి చలిలేదన్నట్లు మీతమ్ముడైన క్రూరసేనుడు నీకుంగాక వనజాసనునికైన వినువాడుగాడు కావున మీరేమి చేయగలరు.

(అంత క్రూరసేనుడు విని)

వృత్తము॥ అనుడికమిమ్ములనిపుడేమననే । మన్ననుయనదగుమీకిపుడున్ ।
వినిపింపగపనియేమిముందునా । పీరత్వముగన తెలియనగున్ ।
అనినమాటలకులెక్కయేమినా । యన్నయేనిట్టులదలపెట్టెన్ ।
అనవరతముయీధీవిశారదుని । అంతమునొందించకవిడువన్ ॥

వ॥ వదరుబోతులారా మీకిపమువచ్చినట్లుకనాయుడు మొదలైతే మిమ్ముల జరిమార్చకపోనివ్వను.

రా॥ యిందులకేమీ । యోచింతమన్నతోచదుగద ॥ యిం ॥ పొందుగనేనీధర ప్రజలందరిపోషింపక ను । న్నందునజయమేమిగలదు । యువనీశుడనైవచింపు ॥యిం॥

వ॥ కావున ధీవిశారదా రాజ్యమును పాలించురాజునై ప్రజల క్షేమములరయకున్న నేమిప్రయోజనము యిందుకుయాలోచన నీవైన యోచించుము.

మం॥ ధరణినాయకా । మీతమ్మునిశిక్షించుటకై ॥ ధ ॥ కర మొప్పగదెలుపనశము । గాదునాకుయెంతైనను । మీరేయోచించు డియా । మీదనేనుపచియింతును ॥ ధ ॥

వ॥ కావున రాజేంద్రా యీవిషయమై మీరు నన్నడుగరాదు యేదేని మీరే యోచించండి.

రా॥ యెంతనిజూతూ । యెంకెటులోర్చియునూదకుందు ॥యెం॥ వింతకార్యములుజరుపగ వానిని మన్నించిననా । యంతటివానినిమాత్రము గొంతునుగోయడెతలచిన ॥యెం॥

వ॥ ధీవిశారదా యిల్లింతకాలమోర్చి యుండగలము భయపడితే వెనుకనున్న వాడే దోచుకునునసేసామెత యెరుగవా.

మం॥ ధారుణియందూ । శ్రీతిప్పాయూపల్లెహరీ ॥ధా॥ కారుణ్యము గలదెటులో । గానిమనకు దెలియవశమె । క్రూరునిబంధించిబందె । ఖాన లోనుంచినమేలగు ॥ ధా ॥

వ॥ కావున రాజేంద్రా మన సేనానాయకునికి సెలవిచ్చితిరేని క్రూరసేనునిబట్టి బంధించి చెరసాలలో నుంచగలడు. సెలవిండుస్వామీ.

రా—వ॥ సచివాగ్రణీ నీవనువిధంబే సేనానాయకుడగు పరాక్రముని కాజ్ఞాపింపుము యిదే నేనంతఃపురంబున కేగుచున్నవాడను.

(అని వెళ్ళిన క్రూరసేనుడు)

వ॥ ఓరి పిరికిపందలారా నేటిదినమున మిమ్ముల బరిమార్చదలచి యున్న నన్నేల బంధింతురు. అబ్బా నన్నుగురించి యెంతకార్యము దలపెట్టియున్నారు.

దరు॥ యిటులవారు నాయెడనలచినమీ । దట నేనెటుల సహింపుదురా । కుటిలాత్ముల నాకరవాలంబున । తటుకునబడ వేతును విడరా ॥ అన్నయటనియూరుకున్ననైననా । కున్న దేమిజయమువ్విలారా । అన్నగాక యింకున్నరుయిద్దరు । క్రిన్ననయమపురి కనిపెదరా ॥ ఆలసించకేపుదయమునన్ చెర । సాలలోనుంచుట నిజమటరా । యిల వెలసిన తిప్పాయపల్లె హరి । నిపుడే దలచు చుబోయెదరా ॥

గీ॥ పిత్తమన్ననుసరిగనా పిత్తమునకు । తగినయౌషధనుడి మాన్పతగునుగాక । యటులె మిమ్ములబరిమార్చి అననిచుందు । యేనుభూమ్మెపతినైయుందు మానితముగా ॥

వ॥ కావున యీధీవిశారదుని నన్ను చెరసాలయుందుంచెకు పరాక్రముని సంహరించి పిదప మాయన్నను వధించెదగాక. సరేకాని వీరశూరులింకను రాకయున్నారు కారణమేమో తెలియదు.

(అంత వీరశూరులువచ్చి)

క॥ వందనములు మహారాజా । వందనములు క్రూరసేన । వీర ప్రతాపా । వందనములు మారాకను । యెందునిమిత్యంబుగోరి యిటివి దేవా॥

వ॥ క్రూరసేన మహారాజా మీకిదో పదివేలవందనంబు లాచరించుచున్నవారము దేవా.

క్రూ—క॥ వర్ధిల్లుడి వర్ధిల్లుడి । వర్ధిల్లుడి వీరశూర వైఖరితోడన్ ॥ వర్ధిల్లుడి నాకోర్కెస । మర్ధతమీకెరుకపరతు మత్ప్రియులారా ॥

వ॥ వీరశూరులారా వర్ధిల్లుడుగాని యొకమనవి.

వీ-వ॥ రాజా అదెట్టిదనవియో దాచక యెరిగింపుము.

క్రూరసేన – వీరశూరులకు వాదం – దర్వు.

క్రూ॥ విన్నవింతు వినుడికనా । విన్నపంబువీనులలర । నన్నుగూర్చి జేసినమా । యన్నగారి ప్రతిజ్ఞలను ॥వి॥

వ॥ వీరశూరులారా నన్నుగురించి మాయన్న యెంత ఘోర కార్యము తలపెట్టెనో వింటిరా.

వీ॥ యెంతఘోర కార్యమొకా । యించుక వచియింపుమయ్యా । వంతగించమీరు జేయు । పాప మేమ నెంచెనయ్యా॥

వ॥ కావున మీరతని కేమి అపకారము జేసినారని పగదలచెనో తెల్పుడు.

క్రూ॥ కరమొప్పగ రేపుదయము । కన్నులతో జూడగాను । సర గునబంధించియు చెర । నాలో నన్నుంచబూనె॥

వ॥ వింటిరా మాయన్న దలపెట్టిన దుష్కృత్యము రేపటిదినంబున నన్ను చెరసాలబద్ధునిగాజేసి వసాక్రిమునికి సెలవిచ్చెనుగదా.

వీ॥ తుచ్ఛము యూహలకులకే । దావంతేమిగొన్నారా । స్వేచ్ఛగ మేముండ మీకు । చింతేలను నగధీరా॥

వ॥ కావున యిందులకై మీరెంతమాత్రము దావింతపడ నక్కర లేదు.

క్రూ॥ యెందైన నను నాకరివా । రిలయందున లేరంటిని । మందుడు మాయన్ననన్ను । నిందించగ వినియుంటిని॥

గీ॥ అన్నయై తమ్ముని యెంచకనవిమందు । బంధనమొనర్చి చెర సాలయందునుంచ । సెలవుసచ్చెను యాధీవిశారదునకు । యెట్టులోర్తును దీనికే నేమిసేతు॥

వ॥ కావున మాయన్నయే నాపై వింత పగదలచిన నేనెట్లుభరింతును.

వీ॥ సలలితముగ నెంచగమీ । సరిబలాఢ్యులెవ్వరయ్యా । బలు ముదమున ధైర్యముగొను । భయపడవని యేలనయ్యా॥

గీ॥ ధరణియందున నినుబోలు పురుషుడెవడు । శత్రులనుబట్టివధి యించె మృత్యువీవై । యుండ నీశక్తి సామాన్య యువకుడెవడు । గెలువ లేడది సత్యమింకేలభయము॥

వ॥ కావున మిమ్ము మీఅన్నయేగాక త్రిలోకాధీశులువచ్చినను బంధింపజాలరు నమ్ముము.

క్రూ॥ సంతసమాయెను నేనొక । సంగతి యాలోచించితి । వింతగు నది దెల్పినవిని । విస్మయమొందేమందురో॥

వ॥ వీరశూరులారా నేనిందులకొకపని జేయదలంచుకున్నాడను గాని మీరేమందురో కదా.

వీ॥ ధారుణి తిప్పాయనల్లె । ధామునిమదిదలచి యుందు । మీరు జేయుపనియెట్టిదో । కూరిమితో దెల్పుముందు॥

వ॥ శూరాగ్రేసరా మీరాలోచించినపని యెట్టిదో తెల్పుడు.

క్రూ-ఉ॥ ఈయెడవారు నాకయిన । నిఃమకనిర్భయ మెంచియున్న బల్ । హేయముగాదె వారుబలహీనులు నట్టెరనుంచబూనినన్ । దాయల లెక్కజేయుదునె దర్పముజూపియు నాదుపట్టిచే । పాయకవార్ని జంపెదను బంధనయేవిధి జేయనెంతురో॥

వ॥ కావున ప్రధమము ధీవిశారదుని సేనానాయకునిజంపి పిదప మాయన్నయైన ఉదయసేనుని సంహరించెదను తర్వాత అన్నభార్య విమలను వరించి మోహించెద వింటిరా.

శూ-వ॥ భేష్ భేష్ యిది చాలబాగున్నది అవశ్యమటులే చేయండి.

( వీరుడు తనలో )

వీ-వ॥ ఆహా శ్రీహరీ యిదియెంతపాపము యితడెంతకఠినంబు దలంచుకొన్నవాడు అందుకే పెద్దలు క్రూరసేనుండని పేరుపెట్టియున్నారు యీపాపపుపని కూడదనిన మొదలునన్నే శిక్షించునేమో సరి దీనికొక పన్నాగము బన్నెదగాక.

క్రూ-వ॥ వీరపాలా నీవు యాలోచించుచున్నవాడ వదియేమి.

యిర్వురికి వాదం - దరువు.

వీ॥ ఇటులజేయుటా । మీకెటులా తగునయ్యారాజ ॥ ఇ ॥ కటకట మీరింతపాప । కార్యము దలపోయుటకు । యెటులగోరె మీమనంబు । యెవ్వరైన మెచ్చగలరు॥

వ॥ నరేంద్రా మీఅన్న నీపై పగదలచినను మీరిట్లుజేయుట పాడిగాదు ఐనను వారినేవిధము సంహరింతువో యోచించుము.

కృ॥ యోచనలేలా । మది యుచితానుచితములెన్నక ॥ యో ॥ యీచెంద్రా ముధముబూని । యీకా(తేపోయివాక్ని । ఆచక్కఖండించక విడ । అన్నగాకనింకిద్దరి ॥యో॥

వ॥ వీరపాలా అన్నైననేమి తనకు (ద్రోహంబుజేయువాడు శత్రువు కామరుగదా.

వీ॥ మాంవేంద్రమీా । కీర్తి మర్యాదయుగాదు సుమ్మి ॥ మా ॥ కానికార్యములను జేయ । గాను జెల్లదెవరికైన । పూనిజేసియున్న జయము । బొందగలరదెట్లులాను ॥మా॥

వ॥ కావున మీారింత శౌర్యవంతులై యుండి దొంగరాత్రిబోయి సంహరించ ధర్మమా యెదురుండని యుద్ధముజేయుము.

కృ॥ ఆలముజేయూ । నాకక్కేర యేముంది తెల్పు ॥ ఆ ॥ జాలి నొందబోకుమింక । యేలభయము నానుడువుల । గేలిసేయవలదిక యెణ । గించెద వారలగర్వము ॥ఆ॥

వ॥ కాబట్టి నామాటలు మీారొప్పకున్న యీాతక్షణమే కార్యసాఫల్యము గాగలదుగదా.

వీ॥ వద్దికవినుమా । యెవ్వరియనుభవమెటులగలదో ॥ వ॥ కొద్ది దినములలోబోయెటి । ఘటమునకై (భ్రాంతినొంది । జిద్దుజేయఫలమదేమి । చిక్కుదువెమ దూతలచే ॥ వ ॥

వ॥ కావున రాజేంద్రా మీాఅన్నను బలిమిన సంహరించి నీవె న్నాండ్లు జీవించగలవు యిట్లు దుష్కార్యములుజేసిన నరకబాధ గలుగునుగదా నామాట వినుము.

కృ॥ కావరముననూ । దుష్కార్యము దలపోయకనుచు ॥ కా ॥ యీావసుధనుసీవు నాతో । యెదురుగ వాదింపుచున్న । వావిరి తిప్పాయ పల్లె । వనజాక్షుడు మెచ్చగలడ ॥కా॥

వ॥ యేమిా నీవు నాకెదురాడుచు నేజేయుపని యుల్లంఘనంబు జేయుచుంటివా నాపరితాపంబు నీవెరుగవు కాబోలు.

(అని కండ్లెర్రజేసిన వీరుడు)

వీ-ప॥ రాజేంద్రా మీాయాజ్ఞకేను వేసున్ననా గాని నాకు రుణబాధ గలిగి అనేకము రందిచే యెటుగోచక బల్కితిని మన్నింపుము దేవా.

కృష్ణా-వ॥ యేమిరా నీకు రుణబాధని ముందు నాకేల జెప్పవైతివి యెవ్వరికి బాకి యెన్నిరూప్యములో తెల్పుము.

వీ-సీ॥ వసుధ తిప్పాయపల్లె నివాసుడైన । చిలుక శ్రీహరియను పద్మశాలివారు । దండిశ్రీమంతుడతనికి రెండువేలు । బాకియున్నాడ రుణబాధ బాయుదెటులో॥

వ॥ కావున అట్టి చిలుక శ్రీహరిగారికి రెండువేలరూప్యములు బాకియుంటిని ఆయన నిన్నటిదినమున మాయింటికివచ్చి రేపుదయమున బాకి చెల్లించకున్న ఇల్లు వదిలించగలనని పలికిపోయెను అట్టిరుణము దీరిన నాకేమితొందర నుండబోదుగదా.

కృష్ణా-వ॥ మిత్రమా యేలచింతించెదవు యిదిగో నాముత్యాలహారము రెండువేల వెలగలది దీనితో నీరుణము దీర్చుకొనిరా పొమ్ము.

వీ-వ॥ రాజేంద్రా యిప్పుడుగదా నాబాధ మాన్పితిరి యీహారము యీచిలుక శ్రీహరిగారికిచ్చి రుణముదీరినదని చెప్పివచ్చెద మీరుండుడు ప్రభు.

కృష్ణా-వ॥ మంచిది వేగిరంబునరమ్ము అదో పొద్దు గ్రుంకుచున్నది.

(అని నిష్క్రమింతురు).

(వీరుడు ధనమును వర్ణించుట దర్వు)

ఘనమైనా యీధనము । గనుగొనుచే సాధనము । ఘననాయీ సముచేగలుగు । యీధనమహిమ । క్షణమాత్రింబున నే తొలగు । మేలూ మేలైనాయ । ద్దాలా మేడలుగట్టి । పూలాతోటలు వేయించూ । యీధన మహిమ । పోలీసులతో దన్నించూ । పట్టేమంచముదూది । పరుపు మెత్తలు నింక । పట్టూదుశ్శాలలు నేమి । యీధనమహిమ । వట్టిచావదొరుకదు భూమి । యెంచాయీధనమున్న । కొంచాగాడైనాను । మంచీవాడని పించూను । యీధనమహిమ । పంచాబాణుని జేయును । తప్పాకయీవసుధ । తిప్పాయపల్లీశు । నెప్పూడుదలచెదను । యీధనమహిమ । గొప్పా తనకే... ఒదానూ ॥సు॥

గీ॥ పాతకముచేతనే పెరుగు పాడుధనము । పుణ్యవంతులకడనుండ బోదుధనము । తననుదిననివ్వదొకరికి దానమైన । నివ్వనివదిట్టిధనగుణం బేమనందు॥

వ॥ కావుననే నీధనమునకు లోబడి క్రూరసేనుడు జెప్పినట్లొప్పుకొనవలసి వచ్చెనుగదా. వినకున్న నన్నిప్పుడేచంపునేమొ కానిమ్ము కాగలకార్యము కాకతీరదు.

(విమల ప్రవేశం – దర్వు)

శ్రీరమణీవల్లభ కరు । ణారసయిటు రావదేల । స్వారాడ్వీధిసుర సన్నుత । సజ్జనపోషణ కేశవ ॥ నందయశోదా ముద్దుల । నందన ముచుకుందవరద । మందరధర శ్రీహరిగో । వింద మానిహృన్మందిర ॥ దీనజనావనఘో । మదదానవ హరదశవేషా । పూని వెలయు వసుధనుతి । ప్పాయపల్లె భక్తపాల ॥శ్రీ॥

చ॥ పరమ దయారసంబుగల పావనమూర్తి వటంచు నిన్నునే । నిరతముగొల్చుచుంటి నవనీతలమందున నీతొ సాటియె । వ్వారుయిటుసంబరంబువను వచ్చియునాయెడ ప్రేమజూడుమో । సరసిజనాభ నిన్నెమది చాలగనమ్మితి మమ్ముబ్రోవవే॥

(అని చిన్నబోయిన చెలికత్తె యిట్లనియె)

చె–వ॥ అమ్మా విమలాదేవి నేడేమొ నీమోము చిన్నబోయియున్నది కారణం.

(ఇర్వురుకి వాదం – దర్వు)

వి॥ కామినిమణి నీకదినే । నేమాని తెల్పుదునే । నామదికెంతో భయమై । నాకెచింత మదిలోనే॥

వ॥ కీరవాణీ నిన్నటిరేయి నేనొక దుస్స్వప్నముఁగంటిని యద్దానిచే మిక్కిలి గుందుచుంటిని యేమిగానున్నదో కదా.

చె॥ యింతటికై నీమదిలో । చింతిలనేమిటికమ్మ । కొంతైనను ధైర్యంబును । గొని అనుమానము వీడుమ॥

వ॥ తల్లీ విమలాదేవి కలలన్ని నిజంబౌనా నీకిదేమి అనుమానము చింత జేయవలదు.

వి॥ కన్నియ నీవిన్ని దెలుప । వున్నచింత దీరదుగద । ఛెన్నుమీర నాదుభర్త । జేరడు యేమాయెనొకద॥

వ॥ కీరవాణీ నీవు జెప్పునదంత నిజంబే కాని నేడేలనో నావిభుఁడు సభనుండి యింతవరకైన రాకయున్నవాడు కారణమేమైయుండవచ్చును.

చె॥ సభయందున జరిగినట్టి । సంగతి యేమందునమ్మ । విభవా క్షిరో నామది కడు । వింతగదోచెను గదమ్మ॥

వ॥ దేవీ మనగృహంబున కప్పుడప్పుడువచ్చు సత్యమ్మకూతురిని మీామరదియగు క్రూరసేనుడు మానభంగమొనర్చెనట దానితండ్రి మన రాజుగారితో మొరబెట్టుకొనుచున్నట్లు వింటిని అందుకే తడవుగా వచ్చెను.

వి॥ యింతటి దుర్మార్గంబూ । యెవరికైన జెల్లూన । యింతిరో విను క్షత్రియులా । కిది ధర్మామయ్యీన॥

వ॥ కావున యాక్రూరసేనుడు జేయు దుర్మార్గములకయ్యో మేము భయంబు నొందుచున్న వారముగద.

చె॥ ధరణియందు వెలసినశ్రీ । తిప్పాయపల్లెవాసు । కరిరాజవరదుడెమిము । కరుణతోడ బ్రోవగలడు॥

వ॥ అమ్మా అన్నింటికి యాసర్వాంతర్యామియే గలడు. నీవేమి చేయగలవు.

వి–గీ॥ క్రూరసేనుడు నామరిది క్రూరములను । మాని యెన్నడు ప్రజలకు మంచివాడు । యానటంచును శౌరికి యనవరతము । మ్రొక్కుచుంటిమి ముందేమి దిక్కుగలదో॥

వ॥ కీరవాణీ యిందులకై నామనోహరుడు రాత్రింబవలు చింతాక్రాంతుడై యున్నవాడుగదా.

చె-వ॥ తల్లీ అదో మహారాజుగారు వచ్చుచున్నారు వీక్షింపుము.

వి-వ॥ మనోహరా మీాకిదో నమస్కరించెద కటాక్షించుము. (అనిన మాటాడకయున్న విభునిగాంచి విమలాదేవి).

సీ॥ ధాన్యరాసులునెల్ల దగ్ధమైననుగాని । చలియింపలేనేడు చపలుడయ్యె । తల్లిదండ్రిగతించ తాదుఃఖమొందలే । దీనాటివార్తకే నేమనందు । స్వప్నమందైనను జడియలేదెన్నడు । యులుకుజెందెనుయేమి బలికినగడు । క్రూరసేనుడుజేయు కుచ్చితంబులకైన । కొంచమాత్రముభీతి గొనడిదేమి॥ గీ॥ గతి తటస్థించెనోకదా అతులితముగ । దెలియ సంకోచ మేమియో గలిగియుండు । ననుచుదోచెను దీనికే నేమిసేతు । అడిగినం దెలుసునిపుడు నేనట్టివార్త॥

వ॥ ప్రాణవల్లభా యేల మీరిట్లు చింతాక్రాంతులై యున్న వారలు నాకుం దెల్పుడు.

(ఉదయసేనునికి విమలాదేవికి వాదం - దర్వు)

ఉ॥ ఏమిదెల్పుదూ । శోభామామణి నీతోడను ॥ ఏ ॥ తామసా త్మజగు మారయొక । తమ్మునియ్యాయుజేసినట్టి । యామహా క్రూరత్వంబును । నలవిగాదుచెప్పుటకు ॥ ఏ ॥

వ॥ మనోహారీ నాతమ్ముడైన క్రూరసేనుడుజేసిన దుండగములను నీతో నేమని వచింతును.

వి॥ నామనోహరా । మీరేమనమున బెగడొందిన ॥నా॥ నామన మునధైర్యము జెడనాయెనింక నెట్లులో కా । తాముయిట్లుచింతజేయ । తగదునాదువల్లభయిక ॥ నా ॥

వ॥ వల్లభా మీరేయిట్లు ధైర్యముజెడిన మాకు ధైర్యము జెప్పు వారెవరు.

ఉ॥ గతివచియింపా । నాకిష్టమెలేదిభువిపై ॥గ॥ స్థితివినియుండిము నేడిట । జెప్పనీకు న్యాయమెవో । సతియెరుగవె మున్నెమంత్రి । సత్తము నేసెను సాంతము ॥ గ ॥

వ॥ కాంతామణీ నాప్రాణమిత్రులైన ధీవిశారదున్ని సేనానాయకు డగు పరాక్రమున్ని వధియించియున్నవాడు యిక నేనేమిసేయుదు.

వి॥ భయపడుటేలా । యీభువి మనప్రాప్తెటులగలదో ॥భ॥ నయ ముగ యాజోలిమాని । భయరహితుడవైతివేని । జయముగలుగకున్నె యింక । చేయునదేముంది నాథా ॥భ॥

వ॥ నాథా జాతస్య మరణంధ్రువం అనునట్లు పుట్టినదే చచ్చుటం దుకుగాని భయపడి జేయునదేమున్నది.

ఉ॥ యెన్నిదెలిపినా । నాకున్నచింత దీరదుగదె ॥ యె ॥ క్రన్నన నామిత్రులయట । గావించినవిధముననే । నన్నుగూడ ద్రుంచునంచు । నాకుదోచుచున్నదిసీ ॥ యె ॥

వ॥ కాంతామణి నాప్రాణతుల్యుల గావించిన విధంబున నన్ను జేయుటకు దూరమున్నదా సఖి.

వి॥ ధరను వెలసినా । శ్రీతిప్పాయపల్లెలోన ॥ధ॥ స్థిరముగాను నిలిచినట్టి । కరివరదుడె బ్రోచుమనల । మరియిట్టులమీరలు యను । మానము దలపోయవలదు ॥ధ॥

వ॥ జీవితేశ్వరా యెందుకటులాను మీరిట్లు యమంగళముగా బలుకకుడు యాశ్రీహరిని స్మరించుచున్న మనల బ్రోవకుండునా.

ఉ-వ॥ నారీమణీ నీవుజెప్పెడివన్ని లోకభ్రాంతికేగాని వేరుగాదు యద్దురాత్ముని చెంతనుండి బ్రతుకుటకన్న బలిమిన ప్రాణములు విడుచుట మేలుగదా తరుణీ.

(విమలాదేవి దుఃఖముతో)

వాదం - దర్వు.

వి॥ యిది మర్యాదేనా । మీరిటుల సాహసముబూనా । మదిలో చాల విచారము । మరిజేయుడీలోనా॥

వ॥ నాథా తమకుజెప్పనంత సమర్థత నాకులేదుగాని మీరే యోచించుడు.

ఉ॥ తరుణీమణివిను నీకిది । తగదే దుఃఖంబూనుది । అరయమనదు ప్రాప్తమెట్లు । నన్నను దెలిపెదనీకది॥

వ॥ కాంతామణీ మీరు దేహబంధువులేకాని ఆత్మబంధువులుగారు కావున దుఃఖించకుము.

వి॥ జీవితేశ్వరా మీరే । దైవసమానులనినమ్మి । కేవలముగ నుంటిమిమా । గతియేమిక వచియింపుమి॥

వ॥ ప్రాణేశ్వరా మీరట్లు ప్రాణత్యాగము చేసుకొనిన మాకేది దారి.

ఉ॥ జీవితేశ్వరీ వోరా । జీవ సమముఖి నీవు । భావమందు చింత జేయు । భావ్యముగాదిక వినువో॥

వ॥ ప్రాణేశ్వరీ యెవరికర్మానుభవము వారుగాని ఆవు లేగకు మేత వేసిపోవునా యేలా యీవెర్రిభ్రమలు.

వి॥ బలిమిన ప్రాణమువిడుచుట । ప్రభువులకును తగదయ్యా । బలుముదమున ధైర్యముగొను । బలుకకు మటులోయయ్యా॥

వ॥ నాథా మీరు అట్లుబలుకుచున్న మాగుండె లదరిపోవుచున్నవి కావున ధైర్యంబూహింపుడు యిందులకు నాకొక యోచన గనబడుచున్నది.

చం॥ సుతునకు యిట్టిరాజ్యమును సొంపుగగట్టుడు యట్టులైనయా। క్షితియును దక్కదేది మనచిన్నికుమారుని జంపడాతడుగ్ । సతతము మీరునేను జనసమ్మతితోడ వనాంతరంబునగ్ । కుతుకముతోడ శ్రీహరిని గూర్చి తపంబును జేయమేలగుగ్॥

వ॥ కాబట్టి రాజ్యభారము మన ముద్దులపుత్రునకొసంగి మనము వనాంతరమునకరిగి శ్రీహరినిగూర్చి తపంబుజేయుదము నాథా.

ఉ-వ॥ అహహా యీయిల్లాలిమాటలు.

గీ॥ రథముదోలెడు సారథి విధమునతియు । పతికిగలిగినవ్యాకుల స్థితియెరింగి । విహితమార్గంబుయోచించి వీనులలర । విచ్చిచెప్పునే యెన్నడు హెచ్చుకథలా॥

వ॥ కావున దీనివాక్యంబులు శాస్త్రసమ్మతముగానే యున్నవి.

ఉ॥ యిల తిప్పాయావల్లే । యీశుని నవరణనేగని । భళిమెచ్చితి నీవాక్కులు । బాగుండెనుగదె భామిని॥

వ॥ జీవితేశ్వరీ నీపల్కులు అత్యంతమధురముగా నున్నవి.

(అంతలో తార కనకసేనులరుదెంచి తలిదండ్రులతో)

క-వ॥ జననీజనకులారా మీకిదో పదివేలవందనంబు లాచరించు వారము కటాక్షించి మీరుంజేయు ఆలోచనయెట్టిదో తెల్పుడు.

తండ్రికొడుకులకు వాదం – దర్వు.

ఉ॥ రారా ధీలోల నాకుమారా నగధీర బాల । కర్రాసేనునీ కృత్యము । లారూఢిగవినుపింతును॥

వ॥ నాయినా కనకసేనా మీపినతండ్రిజేయు దుర్మార్గములకు నాకెటు దోచకున్నదిగదా.

క॥ యేలవ్యాకులము నాయన । యీవిధి ఘనముగ మనమున । ఆలములోన దుర్మాత్ముని । అంతమునొందించగవలె॥

వ॥ తండ్రి అట్టికర్రారుని జంపివేయక యేల యూరకుంటిరి.

ఉ॥ యోచింపగ నిందులకేటు । దోచదు యేమందునురా । ఆచక వానినిద్రుంచిన । భూజను లేమందురురా॥

వ॥ కుమారా తోబుట్టినతమ్ముని జంపెనని ప్రజలు నన్ను నిందించరా.

క॥ సైన్యనాధునటుద్భ్రంచిన । చండాలుడు వానినివిడ । పూని బ్రతుకనిచ్చునెధర । ప్రజలను నిమనమయీయెడ॥

వ॥ జనకా దురాత్ములగువారలెవ్వరైనను శిక్షించి ప్రజలను సవరించుట రాచధర్మముగదా మీకుదెలియదా.

ఉ॥ చెరసాలలో నుంచుటకై । సేనానాయకునికినే । సరగున సెలవిచ్చుటగని । చంపెవానినిద్దరినీ ॥

వ॥ పుత్రా రేపుదయము చెరసాలలోనుంచ ధీవిశారదునితో పరాక్రమునికి సెలవియ్యుమన్న మాటలువిని వారిని సంహరించెను అట్టి వానిని యెట్లు శిక్షింపనగును.

న॥ భయమేలను యింతటికై । పాపమునగ బోకుమికను । నయముగ తిప్పాయుపల్లె । పయుజాతుని దలచిరోను॥

వ॥ తండ్రీ మీకింత దానంతెమొందుకు తెల్లవారులోపలనే నేను వానినిబంధించి కారాగృహబద్ధుని జేసెదను నమ్ముము.

ఉ-వ॥ కుమారా నీవు పసిబాలుడవు వానిచెంతకుబోకుము తారాయుతము నాయొద్దనె పండుకొనుము రాత్రి అతిక్రమించినది.

తా-వ॥ సోదరా కనకసేనా పిన్నవాడవు నీచే యకార్యము గానేరదు కావున శయనింతము రమ్ము.

(తార కనకసేనులు విశ్రమింతురు ఉదయసేనుడు విమలంగని)

గీ॥ భామినీమణి వినవె నాకేమొయిపుడు । నుదరములో బుగులు దోచి కరపదములెల్ల । వణుకుచుండెను దేహ పరవశముగలిగి । యింక నాకెట్లు దోచకయుండెనకటా॥

వ॥ ఇట్లు బుగులుదోచి నిద్ర కండ్లకు గప్పుకొని వచ్చుచున్నది యించుక శయనింతము నీవుగూడ పండుకొనుము.

వి - వ॥ అకటా నేడేమొ కడుదుర్దినముగా కనబడుచున్నది. యేమాటబలికినా యమంగళములే బల్కుచున్నారు. నాధా యికమీరు పండుకొనుడు నేను కొంతసేపు మీపాదసేవ జేయుచుండెదను.

(అని భర్త శయనించిన విమలాదేవి పాదంబులొత్తుచు)

వ॥ (తనలో) యెన్నఁడూలేనిది మత్ప్రాణనాధుని ముఖంబేమొ తేజోవిహీనమైయున్నది యేమిగానున్నదో కదా. నాకుగూడ మిక్కిలి నిద్రవచ్చుచున్నది యించుక శయనించెద.

(అని భర్త పాదంబులదిశకు పండుకొనియున్న)

క్రూరసేనుఁడువచ్చి – దరు.

నన్ను చెరలోనుంచబూని । యున్న సేనానాయకు నీ । పన్నుగపట ద్రుంచితింక । పరగధీవిశారదునీ । క్రన్నన ద్రుంచితినిగాని । గలడిక మాయన్నయును । ఘన్నుమీర నేటిరాత్రి । జంపిజయము గొందు నేను॥

వ॥ ఇప్పటికి నన్ను చెరలోనుంచ సిద్ధముగా యున్న సేనానాయకున్ని ధీవిశారదున్ని ద్రుంచితిగాని యింక మాయన్నను నేటిరాత్రి సంహరించెదను. (అని అన్ననుగాంచి)

( వీరశూరులతో )

వ॥ వరే వీరశూరులారా మీరిద్దరు తారా కనకసేనులయొద్ద నుండుడు యేనిప్పుడే మాయన్నను సంహరించివచ్చెదను.

వీ–శూ–వ॥ మంచిది మేమటులే యుండువారముగాని యికమీరు ఆలస్యము జేయకుడు.

(అంత క్రూరసేనుఁడు అన్నను సంహరించబోయి)

వ॥ ఛీ నేనెంతవ్యర్థుడను ప్రపంచములో నెవ్వఁడేని అన్నను జంపువాడున్నడా (అని చంద్రాయుధము క్రిందవిడుచును మళ్లి తనలో) యేమి నేనిప్పుడు అన్నయని చంపక యూరకున్నచో నన్ను చెరనుంచక విడుచునా అన్నయైననేమి తాను చచ్చేమందు త్రాగుదునా తప్పక సంహరించుటే కర్తవ్యము (చంద్రాయధముచేబూని తనలో) యేమి యీమాయన్నను చంపుటకు చేతులురాకున్నవే యిట్లుజేయుట పాడిగాదు. ఒక్క తల్లి గర్భజనితులముగదా (యని చెంద్రాయుధము క్రిందవిడుచును) ఔరా నేనెంతపిచ్చివాడను పాపదోషములననేమియో అది నాపుట్టుక నుండియే యెరుగను కావున విడువక సంహరించెద (అని సంహరించును అట్టి ధ్వనివిని విమలా తార కనకసేనులు అదరిపడిలేచి)

వి-వ॥ హాహాహా (యని కేకలువేయుచుండ క్రూరసేనుడు వీర శూరులు వెళ్ళిపోదురు. పిదప కంఠంబు దెగిపడియున్న శవమునుగాంచి విమలాదేవి తార కనకసేనులు యేమని దుఃఖించుచున్నారన)

వి-వ॥ హా జీవితేశ్వరా నన్నువిడనాడి పోయితివా (అని శవముపై బడును).

తా-క-వ॥ హా జనకా మమ్ము విడనాడి పోయితివా యిక మాగతి యేమి.

వి-దర్వు॥ నన్ను వీడనాడిపోతివా । హానాధనీవు । నన్నువీడనాడి పోతివా । నిన్నునాతోయీభువిపై । నిష్టములేదనుచుబలికి । యున్నవాడ వైతివినీ । వన్నరీతెనయ్యోనహా ॥న॥ యింతమోసమహానటంచు । యెంత మాత్రిమెరుగకుంటి । చింతతోనినుబాసియు । జీవింతునెట్లుకాంతయింక॥ న ॥ దుష్టక్రూరసేనుడింత । దుండగమొనరించెనుయీ । సృష్టిలోనమీరత నికి । జేసినయపరాధమేమి ॥ న ॥ మమ్ముబోలునిర్భాగ్యులు । యిమ్మహి గలరాచూడగ । లెమ్మికతిప్పాయపల్లె । లోవెలసినహరికృపచే ॥న॥

వ॥ హా నాథా నాథా నీవేమని తలంచుకున్నావో యదేరీతి ప్రాణ ములు విడిచితివా యీక్రూరుడు నన్నుగూడ సంహరించిన బాగుండును గదా మనోహరా నన్ను గొనిపోరాదా.

తార కనకసేనుల - దర్వు

హాతండ్రినినుబాసి । యేతీరునమనగలము । యేతీరునమనగలము। యెవరూపోషింతూరు ॥ హా ॥ భూజననుతమీసరి మహాపుణ్యాత్ములెవ రయ్యా । పుణ్యాత్ములెవరయ్యా । పుడమీలోవలజూడ ॥హా॥ బలిమీన ప్రాణముల । బాసితివినయ్యయ్యో । బాసితివినయ్యయ్యో । యీసమయ మందూన ॥హా॥ పలువిధములనీయొక్క । ప్రాణములెంతయు కలకల । ప్రాణములెంతయుకలకల । పడెనోఘనముగనకటా ॥ హా ॥ నీతమ్మాడై యుండీ । నీకూాయముడాయేన । నీకూాయముడాయేన । మాగతియేమిక తండ్రి ॥హా॥ పాలూమరువాని పసిబాలూలమగుమమ్ము । బాలూలమగు మమ్ము । యేలావిడిపోయితివి ॥హా॥ ధరయందూవెలసీన । తిప్పాయాపల్లిశు। తిప్పాయాపల్లిశు । దరిజేర్చునదెట్టులోమము ॥హా॥

వ॥ హాతండ్రీ పసిబిడ్డలమగు మమ్మెవరిపాలుజేసి పోయితివి నీప్రాణంబెంత తల్లడిల్లెనోకదా (అని తల్లిపైబడి) హాజననీ మనకెంతటి కష్టకాలము సంప్రాప్తమాయెను. యిక మనకేదిదిక్కు.

వి-వ॥ హా నాముద్దుబిడ్డలారా.

(తల్లిబిడ్డలకు వాదం - దరువు).

తా-క॥ అమ్మా గతియేదిమనకు । అప్పులెవ్వరేతల్లీ । యిమ్మహి మాతండ్రిపలెను । యెవరుజూతురేతల్లీ॥

వ॥ జననీ యిక మన నాదుకొనువారెవరు మనముగూడ జనకుని తోడనే జనియుంటె బాగుండునుగదా.

వి॥ బిడ్డలార యట్లుబలుక । బోకుడీయెడనుమీరు । పుడమిలో మనప్రాప్తమెటులో । పూర్తిగావలయుచూడు॥

వ॥ హా బిడ్డలారా మీజనకునితోడనె జనియుంటె బాగుండునని పలికితిరైతె అట్లు మనకు యనుమతిగలదా.

తా-క॥ యింతఘనంబైనపాప । మేమిజేసియుంటిమమ్మ । స్వాంత ములోనందరిమన । సమముజూస్తీ మీగదమ్మ॥

వ॥ అమ్మా మనబ్రతుకు యడవిగాచిన వెన్నెలవిధంబాయెను గదా.

వి॥ పూర్వజన్మ ఫలముగుడువ । బోదురనియు యిలయందున । పూర్వులుదెలుగ వింటిని । ప్రారబ్దంబనబడునో॥

వ॥ కావున మునుపటిజన్మమందు మనమెంతెంతపాపము జేసియుంటిమో అందుకే మనకీగతి సంభవించినది కాబోలు.

తా-క॥ మరలజన్మమెచ్చుటెట్లు । మానవులకునూతల్లీ । మరి యింకిడుములకునోర్చి । మనుటదెట్టులోతల్లీ॥

వ॥ తల్లీ యీయిడుములకునోర్చి బ్రతుకుటకంటె చావు మేలు గాదా.

వి॥ ధారుణి తిప్పాయపల్లె । ధాముడె రక్షించుమనల । భూరిగ మీతండ్రికిను । త్తరక్రియలను గానించుడు॥

వ॥ అయినకార్యమునకు చేయునదేమున్నది దుఃఖంబుమాని మీతండ్రిగారికి దహనాది యుత్తరక్రియలొనర్చుదము.

క-వ॥ తల్లి ఆటులనే గావింతము లెమ్ము (అని యిట్లు ఉదయసేను నికి యుత్తరక్రియలు గావించియున్న సిదప కౄ్రార సేనుడువచ్చి విమలా దేవిని యెదుర్కొని)

కౄ్రా-వ॥ విమలా యిటువినుము.

ఉ॥ సుందరి దుఃఖ మెందులకు చూడుము నీముఖ మెత్తినన్ను యో। చందనగంధినిన్వలచి జేరగవచ్చితి నన్నుగూడియుం । పొందగ సర్వసౌఖ్య ముల బొందుము సర్వము నేనె నైతినా । యందున కోపమూనకను యబ్జ దళాక్షి దయుందలంచవే॥

వ॥ కావున సుందరీమణీ నేటినుండి నన్ను నీభర్తగా నెంచి నాతో సకలసుఖంబు లనుభవింపుము. యేనుగాక నీకెవరు దిక్కు.

వి-వ॥ (తనలో) ఆహా యిదెంతపాపము యీదుర్మార్గుడు నాభర్తను జంపినదేగాక నన్ను రతికేళికిరమ్మని గోరు చున్నాడు. హా నాథా యీబాధదప్పించి నన్ను గొనిపోరాదా (అనిమూర్ఛిల్లి కొంతవడికి లేచును)

వాదం – దర్వు,

కౄ్రా॥ కాంతామణి రావెనన్ను । కొంగలించుకో భామా । యింతీ నీపై ననుమది । భ్రాంతియు గలిగున్నాడను ॥కాం॥

వ॥ సుందరీ మాట్లాడ వెందుకు లెమ్ము యొకసారి కౌగిలిమ్ము.

వి॥ తగునా రాజేంద్రమీకు । తల్లివిధమునన్నుగోర । జగతిలో వదినెలతో యిట్లు । తగవచించువారుగలగ ॥త॥

వ॥ అయ్యా మీఅన్నను జంపితి వైనా శాంతింపక నన్నిట్లు దుర్భాష లాడుట న్యాయమా.

కౄ్రా॥ న్యాయంబన నేమియొకా । నాకు దెలియదే భామా । కాయ జుని బారికోర్వ । గాలేనైతినె భామా ॥న్యా॥

వ॥ కావున నిన్ను గలియగా నెంచి రాత్రింబవలు మిక్కిలి యా సతో నున్నవాడగదా.

వి॥ యాసలేలనాపై యిల । భాసురాంగులికలేరా । రాజవర్య మీకుదగిన । రసికురాల్ని గూడుపొమ్మి॥

వ॥ యికనైన నాయెడ కృపదలంచి పీడి మరొక మీకుందగిన చక్కనిస్త్రీని జూచుకొని మీకోర్కె దీర్చుకొనుడు పొండు. మీకిదే నమస్కరించెద.

కృ॥ యిందుమ శ్రీ నీసరియిల । యెందునలేరెభామా । అందగత్తె వని వలచితి । పొందుదుఃసుఖమనిభామా ॥యిం॥

వ॥ కావున సుందరీ నిన్నుగాక అన్యస్త్రీల గోరియుండలేదు. మిక్కిలి నీయందే భ్రాంతిగలిగున్నాడను వింటివా.

వి॥ యిదియే మీదుర్బుద్ధీ । వినవేలానాసుబుద్ధి । మదిలోనా దూర భార । మెంచియు దుర్గుణమాఃమాను ॥యి॥

వ॥ మహాత్మా నన్ను మీరిట్లన పాడిగాదు నాబోటి దీనురాలిని యెవ్వరైన బాధపెట్టిన మీబోటిశూరులు రక్షింపనే యు గాన కరుణిం చుము.

కృ॥ కరుణించుడటన్న మాట । కర్థమేమిచే భామా । కరమొ ప్పగ నేనెరుగను । గాన తెల్పవేభామా ॥క॥

వ॥ సుందరీ నీవునన్నిట్లు నిరాకరించి పల్కుట తగునా.

వి॥ సుందరి యనబోకుమయ్యా । అందరివలెయెంచినన్ను । పొందె వు నరకంబుయింక । పోజాలవు స్వర్గమునకు ॥సుం॥

వ॥ అయ్యా మీరు నాకు మరదియైయుండి వదినయని పిలువక దుర్భాషలాడుట తగునా.

కృ॥ నీవేదాంతంబులు యిట । నీకుజెల్లునేగాని । భావింపగ నాకొప్పవు । భామామణి నేవింటిని ॥నీ॥

వ॥ ఓసీ దురాత్మురాలా యెంతజెప్పిన నామాటలు వినకయున్నావు గదా యిక నిన్ను బలవంతముగా గాఢాలింగన మొర్చుకొనెద (అని కౌంగలించుకొనబోన విమలాదేవి తప్పించుకొని తనలో) అకటా యిక నాగతియేమి హా సర్వేశ్వరా నాయెడ నించుకైన కరుణరాకున్నదా ప్రస్తుతమీతనినే నెట్లు దప్పించుకొనగలను (ప్రకాశముగా) అయ్యా.

వి॥ వినలేదే శాస్త్రములను । గనలేదా ధర్మములను। ఘనముగ తిప్పాయువల్లె । గలహరిభక్తులు దెలుపగ ॥వి॥

వ॥ కావున యింతకుమించిన రవరవాది నరకమెద్దియైనగలదా యిందుకు నాప్రాణంబులుండుదాక సమ్మతింపను నమ్ముము.

సీసమాలిక వాదం.

కృ॥ యేల రౌరవపాపములనుగల్గను మరు । బాధకోర్వగలేను పడతియేను॥

వి॥ మారుబల్కుటదేల ఘదనతాపముయేల । వద్దుపొమ్మికనాతొ వరుసగాదు॥

కృ॥ వరుసలెంచుటదేమి వద్దుపొమ్మనుటేమి । నినువీడిఘడియైన నిలువలేను॥

వి॥ నిలువలేననుటేమి । నీకువదినెనుసుమ్మి । నన్నువీడుమునీకు పుణ్యమబ్బు॥

కృ॥ పుణ్యమబ్బుటయేమి । పురుషార్థమదియేమి । నిన్నుగూడని దేహమున్ననేమి॥

వి॥ చాలుచాలికయూర్కొ । సంశయించకమాట । లాడుచుంటివి పిల్లలాటగాదు॥

కృ॥ పిల్లలాటనినన్ను బెదిరించిపల్కినా । పోదునెట్టుల నిన్ను బొందకుండ॥

వి॥ నన్నుబొందుదటన్న నరకమంటునునోరు । మూయుమింకను చాలు । మెచ్చరెవరు॥

కృ॥ వారలుమెచ్చియునాకు । నొసగుకానుకలేమి । మచ్చికలరగ ముద్దు । లిచ్చిచూడు॥

వి॥ ముద్దులియ్యగనీకు । మూర్ఖురాలనుగాను । పాతివ్రత్యమువిడువ పశువుగాను॥

కృ—గీ॥ యింత కాఠిన్యమేలనే । కాంతనాపై
వి॥ బుద్ధిహీనుడనాతోను । పంతమేల
కృ॥ బలిమినను గూడెదనుచూడు । భామనేడు
వి॥ పాపకర్ముడ నీతోడ । బలుకరాదు॥

వాదం – దర్వు.

కృ॥ పలుకవేలనే । వోభామామణి నాతోడను ॥ప॥ కలికినాతో

నీవుయిట్లు బలుకకున్న నోగ్సునెట్లు । పలుకుమొకటి చిలుకపలుకు । యలిగి యున్న వెందుకాని ॥ప॥

వ॥ పిచ్చిదానా ముందటివారెందరో యిట్లుజేసి సౌఖ్యపడలేదా యికనైన మూర్ఖింపక చెంతజేరి ఒకసారి నీచిలుకపల్కు-లుకా బల్కి-నాకోర్కె-దీర్చుము.

వి॥ తగదటులనగా । యీతగనికార్యముకై యింత ॥త॥ వగలేలా బలికెవునే । మిగుల పతివ్రితనుసుమ్మీ । అగడుజెందబోకు నీకు । నోదా ననుగాను పొమ్మి ॥త॥

వ॥ యేను ప్రాణంబులుబోయిన నోర్చెదనుగాని యీపాపకార్య మునకు యిష్టపడను వింటివా.

కృ॥ పొద్దుగడుపకూ । పాపపుణ్యంబులు నిజంబనకు ॥పొ॥ బుద్ధి లేనివారు కథలు । పొద్దుబోవుటకువ్రాసిరి । శ్రద్ధతో నామాటలువిని । చెంతజేరి కోర్కె-దీర్చు ॥ప్రొ॥

వ॥ కావున యేలా నీకీమూర్ఖము నన్నుగూడిన నీకే కష్టంబుండ బోదుగదా.

వి॥ తమకుజెలియనీ । శాస్త్రంబు లేమిలేవుగాన ॥త। నామనవొక టింకవినుము । నాలోచనజేసికనుము । భూమినిపతివ్రితలు కష్ట । పడియు తుదకు పరమందిరి ॥త॥

వ॥ పూర్వమెందరో పతివ్రితాశిరోమణులు అధిక కష్టములపాలు గానులేదా తుదకు సౌఖ్యంబుండి పరమందిరి వింటివా.

కృ-వ॥ (తనలో) ఓహో నేనెంతజెప్పిన దీనిమనస్సు గరుగకు న్నదిగదా మంచిది వీరశూరులరావించి కనకతారల బట్టితెమ్మని వారల బాధపెట్టిన వినకుండునా (అని వీరశూరులవంకజూచి) వోరే వీరశూరు లారా కనకతారల నిటకీడ్చుకొనిరండు వేగంబునబొండు.

అంత వీరశూరులు.

వ॥ రాజేంద్రా చిత్తము యిదో పోవుచున్నారము.

వి-వ॥ (తనలో) అయ్యో తనయులారా యీకౄరసేనుడు మిమ్మెంత బాధపెట్టునోకదా (అని యేడ్చుచుండ)

కృ॥ యెంతోనీకనూ । నేనింతవరకు దెలిపియుండ ॥యెం॥ పంతముతో తెలిపినకా । సంతనైన వినకుంటివి । వింతగునాపొజ్ఞనీవు । గాంతువు యీక్షణములోన ॥యెం॥

గీ॥ వనితనేజెప్పినట్లు నీవినకయున్న । భీతిలేకను నీకన్నబిడ్డలైన । కనకతారలజంపి నీమనసుకింక । శోకమునుగూర్తువినగదే ప్రాకటముగ॥

వ॥ కావున నీబిడ్డలంబట్టి తెప్పించి నీముంగిట ఖండించెదను అప్పటికి నీకు బుద్ధి వచ్చునుకాబోలు.

వి-వ॥ (తనలో) ఆహా శ్రీహరీ యిక మాకెవరుదిక్కు.

వి॥ యెటులజేసినా । మీరు యెజమానులైయున్నరు ॥యె॥ కుటిలంబును లేకమమ్ము । కృపతో రక్షించుమయ్య । తటకున తిప్పాయపల్లె వటపత్రాంకుడు బ్రోచును ॥యె॥

వ॥ అయ్యా మీరెట్లుజేసినను యీసూర్యచంద్రాదుల సాక్షిగ నెట్టి కష్టములకైన నోర్తునుగాని పాతివ్రత్యమునకు కళంకము దెచ్చుకొనజాలను.

( క్రూరసేనుడు తనలో )

వ॥ యేమీ దీనికి నే నెంత భయంబుజూపినను కించిత్తయిన జడియకున్నదే వీరశూరులింక రాకయున్నారు కారణం (అంత వీరశూరులు కనకతారలబట్టి తెచ్చినంగని) మిత్రులారా యేల నింత నాలసించితిరి.

వీ-శూ-వ॥ దేవా యీచిరుతలు త్వరగా నడువనందున ఆలస్యమైనది మన్నింపుడు (అంత క్రూరసేనుడు కనకతారల చేయింబట్టి చెంద్రాయుధము చేబూని విమలంగని)

వాదం - దర్వు.

కృ॥ చూడుచూడుము నీవింకా । నీసూనులబట్టియు నేనింకా । నేడే నాకరవాలంబుననూ । నీముంగిట ఖండించెదనికను ॥చూ॥

వ॥ ఒసే దురాత్మురాలా నేనెంతజెప్పిన వినకున్నవైతె యిపుడే నీపుత్రిపుత్రుల నీకేబలియిచ్చెద చూడుము. (అని కనకతారల గొట్టబోవ విమలాదేవి అడ్డగించి)

వి॥ యింతకోపమూ మాయెడనూ యిక । పంతమేల పసిబాలులనూ । మంతనమున దయలేకద్రుంచకా। సంతసమునసహరించుమికా॥యిం॥

వ॥ అయ్యా మీ యాజ్ఞను సేనాధిపతిని జంపిన నీకడ్డమొచ్చినవారె వరు గాని యీపసికూనలేమిపాపముజేసిరి మన్నింపుము నీపాదంబునకిదే ప్రణమిల్లెదను (అని పాదంబులపై బడిన తన్నును)

కృా॥ చాలుచాలు నీసాహసమూనే। చాలగంటి నీచతురతనూ। యేల నాతో వాదంబును నీవిక । చాలించుమునే । చంపకవిషువను ॥చా॥

వ॥ యేమీ నీసక్కవినయములకేను వినువాడనా నాకోర్కె దీర్చితివేని సర్వము నీస్వాధీనముజేసెద లేకయున్న నీబిడ్డల యమపురికని పెద వింటివా.

వి॥ వలదు వలదు నీకాళ్లకు మొక్కెద । వారినిడువు పుణ్యము నీకూ । బలుముదమున జంపగబూనినా । ప్రాణిదీయు వెనుకందియకూ॥

వ॥ రాజేంద్రా అట్లు మీకు చంపవలయునని భ్రాంతి గలిగి యుంటే నన్ను ముందు సంహరించి పిదప బాలులనేయుడు.

తా-క-దర్వు॥ వందనమయ్యా । మహిధర సహరించుమయ్యా ॥వం॥ తొందరొందియుంటిమి కడు । తండ్రిని గోల్పోయితిమిల । యిందూ యీచందామున గుండాజేసెదవేలను ॥ తండ్రివెనుకతండ్రివి పిన । తండ్రివి నీవయ్యామాదు । తండ్రీలేకుండా ద్రుంచుండీశివింక నేల ॥వ॥ పిల్లలమము ద్రుంచినతి । ప్పాయపల్లెహారిమెచ్చునె । తల్లీ మేమెల్లా దురపిల్లా మేలౌనె నీకు ॥వ॥

వ॥ అయ్యా పసిగందులమగు మమ్ముద్రుంచిన నీకేమిఫలము పిన తండ్రివైయుండి మమ్మిట్లు కష్టపెట్టపాడియా కరుణించి మాతల్లిని మమ్ము కాపాడుము నీపాదంబులకిదే ప్రణమిల్లెదము. (అని పాదంబులపై బడు దురు క్రూరసేనుడు తన్నును)

వ॥ వోరే వీరశూరులారా.

కృా॥ మీరలిపుడు యీబాలులనూ మది । కారుణ్యంబును లేక యునూ । కారాటవిలోబట్టియు వీరల । ఖండించియు రాపొండియిటూ॥

వ॥ మీరిప్పుడే యీ కనకతారలగొనిపోయి కారడవిలో వీరితలలు ద్రెంచివైచి రాపొండు లేదేని మిమ్ముల సంతతునిపురికనిపెద వినుండు.

వీ-శూ॥ భూవరేణ్యా మీరుదెలుపు । పగిది జేయువారమూ । కావున మీయాజ్ఞరీతి బోవనెంచినారమూ॥

వ॥ నరేంద్రా మీరనువిధంబుననే కనకతారల దృంచుటకై పోవు చున్నవారము.

వి-వి॥ హా చిరుతలారా యిక నేనేమిసేయుదు నాబాలులకికెంత మాత్రము ప్రాణములమీాద యాశలులేవు. యిక నే బ్రతికియుండజాలని దే సముద్రములో బడిమెదగాక (అని సముద్రమువై పేగనుండిన క్రూరసేనుడు విమలంబట్టిలాగి)

క్రూ॥ హే పాపిష్టురాల వినుమీాయది । తేపకు చింతిల్లినవిడనూ । నీపాపల ఖండింపబంపితిని । నీకు యెక్కు యెవరింకగనూ॥

వ॥ హే పాపిష్టురాలా నీబాలుల ఖండింపబంపినది జూచియుందువు గదా యిక నీకెవరుదిక్కు.

వి॥ ధరవెలసిన తిప్పాయపల్లెహరి । కరుణాకర మీాచరణములూ । స్మరియించిన మముదరిజేర్చనయిక । క్షణము బ్రతుకజాలగ లేను॥

వ॥ హే జగద్రక్షకా యీాదురాత్ముడు నాభర్తను జంపినదేగాక నాప్రియసూనులనుగూడ ఖండింపదోలించె యిక నేను బ్రతికియుండ జాలను యీాసముద్రములోబడి ప్రాణములు విడిచెదగాక. (అని సముద్ర ములోబడినంత క్రూరసేనుడు).

వ॥ ఛీ పాపిష్టురాల నేటితో నాపీడవదలినది పోమ్ము.

(అని వెళ్ళిన అరణ్యములో కనకతారలు వీరశూరులు)

క-తా-దరు॥ శ్రీనాథా సింధుశయన । గానలోల గావవేల । దీనులమై యుంటిమీాకడు ॥యో దేవదేవ॥ దీనజనావనకడతేర్చు ॥ తల్లివి దండ్రివి మాయొక । దైవమునీవనియును యిక । యుల్లములో నమ్మితి మయ్యా ॥యో దేవదేవ॥ చల్లగరక్షించగదయ్యా ॥ మాపినతండ్రియు నింతయు । పాపమునకమాపైనను । యీాపగిదియాజేసెను మమ్మా । ॥యో దేవదేవ॥ కాపాడియుబ్రోవు శీఘ్రమూ ॥ జననిజనకులకునోచని । జాతస్సూలమైతిమిప్పుడు । ఘనయడవిలో ప్రాణంబులనూ ॥యో దేవదేవ॥ గోల్పోయెటి కాలమాయెనూ ॥ యిలయందున కీర్తిగాంచ । వెలసిన తిప్పాయపల్లె। నీలవర్ణ నీవుగాకనూ ॥ యో దేవదేవ ॥ చాలగమము బ్రోచె రెవరునూ ॥యో॥

వ॥ సర్వేశ్వరా దీనులమగు మాకెట్టికష్టములొనరించితివి. అయ్యో కర్ణారసేనా నీవు మాపినతండ్రిపై యింతగాసి పుచ్చదలంచితివా తండ్రీ.

పీ-వ॥ చాలుచాలు మీసంభాషణలు యిక కాలముగడుపుటెం దుకు వింటి రా వీరివేదాంతములు పిట్టచిన్నది కూతఘనము యనునట్లున్నది.

శూ-వ॥ యింక చూచెద వెందుకు యిప్పుడే వీరి కంఠంబులునరికి వెళ్ళవలయునుగదా (అని కనకసేనునిబట్టి) ఒరే బాలకా మొదట నీకం ఠంబుద్రెగవైచి పిదప నీభగినితలద్రెంచెదను యికనీవీ భూమిపై బదుకుము. (అని కనకసేనుని క్రిందబడవైవ తార తమ్మునిపై బడి)

తా-వ॥ హాతమ్ముడా కనకసేనా మనకెట్టికష్టములు సంప్రాప్త మాయెనురా తండ్రీ శ్రీహరీయిట్టి ఘోరారణ్యంబున నీవుందప్ప మాకెవరు దిక్కు దీనులపాలిటి దైవంబగు నీవెందుబోయితివి హాజగదీశ్వరా రక్షిం పుము.

తా - కన - వాదం - దర్వు.

తా॥ నాతిమ్మీమనకింకా । గతియేమిర కనకయ్యా । యీధర మనలనుబ్రోచే । యోధాగ్రేసరులెవరూ ॥ నా ॥

సీ॥ మనపిన్నతండ్రి దయ । మాలి వనములో జంప । బంపెనిందున మనల । బ్రోచెరెవరు । గాన దుర్బలమయ్యెనూ నాశరీరమం । దనయంబు బాధగలిగెను యికెటులో । దాతిలెవ్వరులేరు ధరను పాలించగను । గాను వారులేరు దరిగానరాదు । పరుపుమెత్తలమీద । వవళించునీమేను । పలు గురాళ్ళలోద్రొబ్బి । పడగవేసి । చంపబూనిరివీర । నూరులిప్పుడుమనల। దయయింతలేక నిర్దయుదలంచి ॥ చాపసిద్ధంబుగానున్న జననియెచటి । కరిగె మునుమున్నె జనకుండు అంతమొందె । బ్రతుక మనకిందుదైవంబు బాలుపడున । నీచజన్ముల నెవరుద్ధరింతురకటా॥

వ॥ అయ్యో తమ్ముడా మెత్తనిపాన్పులందు శయనించు నీశరీరంబు పలుగురాళ్ళలో బొరలుచుండెనుగదా యిక నేనెట్లు సైరింతును.

కన॥ భగినీ నీవిపుడూయీా । పగిదీ యేడువగాను । బుగులుం దోచెనుకద కడు । భూరిగనాకిపుడూను ॥ భ ॥

వ॥ కావున అక్కా మనకాబ్రహ్మదేవుడు నాయుష్యంబింతియే వ్రాసియుండును కాబోలు, లేకున్న యిట్లగుటకేమి కారణము.

తా॥ ముందటి జన్మమునందున । నెందరిప్రాణులదీస్తిమొ ।
అందుకె మనమీయాపద । జెందుచుంటిమేమొ తమ్మి ॥ ముం ॥

వ॥ కావున పూర్వజన్మమున జేయుకర్మంబు లెవరుదప్పింతురు.

కన॥ యేవిధమున మనమిప్పుడు । యీయెడ దరిజేరగలము ।
కావున భగినీమణి దరి । గానరాదు బ్రతుకదేమొ ॥ యే ॥

వ॥ అయ్యో దైవమొలేడు వున్నయెడల మనకేల యిట్టిబాధలు గలుగును.

తా॥ జనని జనకులను బాపియు । మనపినతండ్రిట్లుజేసె । గను
గొనువారెవరు కర్మ । మనుభవింపకను తప్పునె ॥జ॥

వ॥ కావున తమ్ముయ్యా వచ్చేకర్మము చచ్చినతప్పదు గాన మనము దైవమునుదూరిన నేమిఫలము.

కన॥ ధారుణి తిప్పాయపల్లె । సారసాక్షుడయ్యీనహరి । నీరీతిని
స్మరియించిన । కారుణ్యము గలుగకుండె ॥ధా॥

వ॥ అక్కా మనమిట్లు దుఃఖించుచున్న మన నాదరించువారెవరు.

శూ-వ॥ అబ్బా వీరి వేదాంతోపన్యాసము యింక ముగియకున్నదే వేయిరాత్రిలు వేయిపగల్లుయైన నిట్టులే జెప్పుకొనుచుందురు. వరే వీరా చూచెదవెందుకు వీరిర్వురిని గట్టిగా పట్టుకొనుము నేను యీగొడ్డటం నరికెద.

తా-కన-వ॥ హా సర్వేశ్వరా యిక మాగతియేమి (అని మూర్ఛిల్లినంజూచి వీరుడు శూరునితో)

వీ-వ॥ ఒరే నీవెంత కఠినుండవురా రాళ్ళుగరుగునట్లు యేడ్చుచున్న పసికూనలంబట్టి చంపుటకు నీచేతులెట్లువచ్చునురా.

శూ-వ॥ సరెసరె నీమాటలకేమిలే వీరినిచ్చుటజంపకున్న మననచట క్రూరసేనుడు బ్రతుకనిచ్చునా.

వీ - శూ - వాదం దరువు.

వీ॥ వినర శూర నీకొక్కటి । విన్నవింతు నేనికా । మనకువీరినిట్లు
దృంచ । మరియాదయుగాదికా॥

వ॥ ఒరే తనప్రాణముల గోల్పోయినను సరేకాని యితరులరక్షించుట సజ్జనలక్షణమని యెరుంగవా.

శూ॥ సజ్జన లక్షణమనినను । బుజ్జగించుచుంటివా । ముజ్జగములో పేరుగాంచి । లజ్జగాదురఁటులనా॥

వ॥ ఒరే వీరశూరులమని ప్రపంచములో పేరుగాంచి యిటు బలు కుటుకు సిగ్గనిపించదురా.

వీ॥ జీవహింస జేయ నెంతో । లావుపాపమందురూ । కావు వీర్ని పుడుద్ధంచ । గాను నరకమంటునూ॥

వ॥ జీవహింసజేయ మహాపాపంబు సిద్ధించును వింటివా.

శూ॥ యిందుకు యాలోచననీ । వేమిజేసియుంటివీ । పొందుగ నిట్లొనరించిన । భూరిపాపమంటివీ॥

వ॥ అబ్బా అంతయోపిక నావద్దలేదురా నీవు వీరలవిడిచి పోదా మందువేమొ కాని మన యజమానిమాట జవదాటరాదుగదా.

వీ॥ యెవరికైన ప్రాణతీపి । యెక్కువగానుండునూ । సవినయముగ నందరి తన । సమముజూడ వలయునూ॥

వ॥ నీప్రాణములమీదితీపి నీకెట్లో సకలప్రాణులకట్లే కావున యీబాలులరక్షించి పుణ్యము సంపాదించుకొనవచ్చును వింటివా,

శూ॥ ధారుణి తిప్పాయపల్లె । ధాముడెరక్షించునూ । ఆరూఢిగ నీవుదెలుపు । యాజ్ఞయునేమీరనూ॥

వ॥ అటులైన సర్వభారము నీదే నాదేమిలేదు నీవుజెప్పినట్లు వినగలను.

వీ-వ॥ మంచిది నీకేమాత్రం భయములేదు నమ్ముము (అని మూర్ఛ నొందియున్న కనకతారలలేపి) బాలకులారా మిమ్మిచ్చట విడిచిపోయె దము కావున మీరు మీపినతండ్రిగారికి అగుపడకుండ చాలదూరము వెళ్లిపొండు.

తా-వ॥ మహా పుణ్యాత్ములుమీరు మాయందు కరుణబూని మన్నింపదలిచితిరా సరి మీరు దెలుపునటులే వెళ్ళుదుము.

వీ-శూ-వ॥ మంచిది మేము వెళ్ళుచున్నారము. (అని వెళ్ళిన తార తమ్మునితో).

తా-వ॥ కనకసేనా చూచితివా భగవంతునిమాయ యెంతలో మారినది సరి తమ్ముయ్యా యిపుడుగదా మనప్రాణములు దక్కినవి.

గీ॥ జలములనుదెమ్ము సోదరా క్షణముతాళ । లేను దాహంబు అధికమై లేశమైన । నడువరాకుండె తోవింక నాకయిపుడు । కనులు చీకట్లుగ్రమ్మెను కానరాదు॥

వ॥ తమ్ముడయ్యా కనకసేనా నానాలుకయెండి లోనికి యీడ్చుకొని పోవుచున్నది కావున శీఘ్రంబున జలములుదెమ్ము లేకున్న బ్రతుకజాలను.

కన–వ॥ అక్కా యీభీకరారణ్యంబున జలంబులెట్లు లభించగలవు. మెల్ల మెల్లన యేదైన నొకగ్రామంబు జేరబోవుదము రమ్ము.

తా–వ॥ తమ్మీ అటులనే పోవుదము పదుము (అని తల్లినిదలంచి)

వాదం – దర్వు.

తా॥ అమ్మా యెటుబోయితివే । మమ్మాలగనరావే । అమ్మా యిలలోనినువిడి । అడవిలో బ్రతికుంటిమే ॥ అ ॥

వ॥ హా జననీ యెటులో మేము దక్కితిమిగాని నిన్నాక్రూరసేనుడు మన్నించి విడిచెనో లేదో కదా.

కన॥ తల్లీ నిన్నెడబాపెను । దైవామీనాటికినీ । మళ్ళియు మాకన్నులకు । మరిగానరావేమో ॥ త ॥

గీ॥ అమ్మనీగర్భమున జననమైతిగాని । లాభమును లేశమాత్రంబు లేదులేదు । నాదివృథజన్మ పినతండ్రినిన్నుబట్టి । కష్టపెట్టంగజూచితీ । కనులతోడ॥

వ॥ అమ్మా నీకడుపునయేను మొగబిడ్డనై పుట్టి నీకష్టములు దీర్చ లేకబోయితిని నాది వృథా జన్మముగదా తల్లీ.

తా॥ హాజనకా మముబాసీ । హతమాయిపోతివా ॥హా॥ యీజగములోమమ్మింతా । యిడుములబడజేసితివా॥

వ॥ హా తండ్రీ నీవున్న మాకిట్టికష్టంబులు రాకుండునుగదా.

కన॥ నాన్నా మమ్మెడబాపెను । నీతమ్ముడు క్రూరసేను । కాననంబులోజిక్కియు । కడు చింతిల్లగనాయెను॥

వ॥ హా జనకా యాదురాత్ముండు నిన్ను జంపినదేగాక మాతల్లికి బాపి యింతకష్టము గలుగజేసెగదా.

తా॥ తమ్మీ యికయేమిసేతు । దాహంబున కోర్వలేను । సుమ్మీ నడువగజాలను । స్పృహదప్పెను నాదేహము ॥త॥

వ॥ సోదరా యిక నేనేమిసేయుదును కన్నులకు చీకట్లు గ్రమ్ముచున్నవి కావున నెట్టులైనను కాపాడుము (అని మూర్ఛిల్లును)

కన-వ॥ ఆహా దైవమా యిక నేనేమిసేయుదును మద్భగిని మూర్ఛాగతురాలయ్యెగదా.

కన॥ ధారుణి తిప్పాయపల్లె। నారాయణాచ్యుత। కారుణ్యముతో మమ్ముల। గావవ దేవార్చిత ॥ధా॥

వ॥ శ్రీహరీ మాయెడ కృపదలంచి జలంబులు గాన్పింపజేయుము. (అని జలములకై వెళ్ళును ఇంతలో)

దొంగ ప్రవేశం - దరువు.

దొంగోన్నిరా భళి దొంగోన్నిరానేను। దొంగతనమును జేసె లింగన్నిరా। అంగయినయిండ్లన్ని దొంగిలించియుచాల। బంగారమును గూర్చి పెడితినిరా ॥దొం॥ అందరికన్నాను యెక్కువనేనే। అదృష్టమంతుడ నౌదునురా। యెంద్దైననుబోల రెవ్వరు నేసిరి। మంతూడనింకా ధీమంతూడరా ॥దొం॥ పాటీగతిప్పాయ పల్లెలో వెలసీన। హాటకాంబరూ నెప్పాటికిరా। మాటికిదలచెద మదిలోభజించెద। కూటిగుడ్డలకింక కొదువేదిరా ॥దొం॥

వ॥ యీయాల్ల కాళికమ్మోరుకు మొక్కితె పత్తెచ్చమె యేమంటాది నాకు కన్నెపిల్లనుదెచ్చి భలిత్తె నీకు మేలుజేత్తనన్నదిగాని యెంత యెతికిన కన్నెపిల్ల దొరుకుతలేదు తల్లికటాక్షమెట్లున్నదో యింక యెతికి సూత్తగాక. (అని వెళ్ళును అంతట తారలేచి).

తా-వ॥ సోదర్లా కనకసేనా జలంబులు దెచ్చితివాలేదా, (అని అటుయిటుజూచి తమ్ముడు లేనందున)

తార - దరువు.

తా॥ తమ్ముడనీవూ। నేదాహాముచే స్రృహదప్పిన ॥త॥ యిమ్ముగ నను విడిచిపోను। యిష్టమెట్టులాయెనుశీ। ఘ్రమ్మునవచ్చెదవనినా। తమ్మి నిన్నెదలచుచుంటి ॥త॥

వ॥ హా తమ్ముడా తమ్ముడా అయ్యో యెక్కడనులేడే.

తా॥ యెందరిగితివో । నన్నిందున వొంటరిగవిడిచి ॥యెం॥ సందే హించకను నీవు । సరగున వేంచేయవేర । గుందుచుంటి నామానస । మందున భయమొందియుకడు॥

ఉ॥ ఎక్కడికేగినావో నినునెట్టుల నేగనుగొందు నాకునిం । కెక్కడిదిక్కుదోచదుగ నీవిపినంబున ఘోరజంతువుల్ । లెక్కకుమిక్కిలుండె దిగులెంతయుగొంటివో నీమనంబునకా । అక్కటనిన్ను బాసి యిటు లార్తిని జెందగనైతి తమ్ముడా॥

తా॥ ధారుణి వెలయూ । శ్రీతిప్పాయపల్లెహరీ ॥ ధా ॥ కారుణ్యము లేకమనల। నీరీతిగ బాపెనుగా। కూరిమినా సోదర రావేర కనకసేనయింక॥ధా॥

వ॥ ఆహా నేనెంత తెలివిలేనిదానను దాహము దాహమని పలుమారు కలువరించి స్పృహదప్పి భూమిపై బడితిని. యీఅరణ్యమున నాతమ్మునికి నీరు లభించెనో లేదో లేకున్న రాకుండునా యింక కొంత తడవు తాళియుండెదను.

(అంతలో దొంగవచ్చి)

దొం–వ॥ యిదోల్లోకాని తమ్ముడాయని యెక్కతే యేడుత్తున్నది. దీనితమ్ముడెవడుగావచ్చును. కొంచెము దగ్గరికెల్లి అడిగిసూత్తగాక (అని) పిల్లా వోపిల్లా మీరోల్లే నాకు జెర్ర జెప్పు.

(తార దిగ్గునలేచి దొంగనుజూచి భయమొంది)

వ॥ యేమిా వీని రూపంబుజూచిన నామది భీతిగలుగుచున్నది. ఆహా శ్రీహరీ వీడు నాకేమి కీడుచేయునోకదా.

తా – దొం – వాదం దరువు.

దొం॥ వోల్లెపిల్ల నీవుయిందు । వొక్కతి వేత్తున్న వేమె । కలలాడబోకనాతో । తెల్లముగాదెల్పవేమె ॥వో॥

వ॥ పిల్లా వోపిల్లా నీవేవ్వలో చెప్పు మాటాడవేం.

తా॥ యేమానీ తెల్పుదునా । శ్రీమలూనీతో నేను । స్వామీనాపై నీకు । తామాసం బేలాను ॥యే॥

వ॥ అయ్యా నిన్నుజూడ నాకు భయంబగుచున్నదిగదా.

దొం॥ అయ్యాపేరేమిానీ । అవ్వాపేరేమోకా । యియ్యేడ నీతమ్మా । డెవడో జెప్పుమింకా ॥అ॥

వ॥ పిల్లా నీఅయ్యవ్వపేరు యింక తమ్మునిపేరేందో ఆనిపేరు అన్ని నాకుజెప్వు యింట.

వ॥ (తార తనలో) వీనితో నావృత్తాంతము నెరిగించిన మేలు జేయునేమొ తెల్పెద.

తా॥ కోపమేలవుదయసేన । భూపాలుని పుత్రికను । నాపైకరుణించుమింక । నానామము తారవిను ॥కో॥

వ॥ అయ్యా మాతండ్రి ఉదయసేనభూపాలుడు. తల్లి విమలాదేవి. తమ్ముడు కనకసేనుడు. నాపేరు తారవింటివా.

దొం॥ సరెసరె నాకెంతో చాల । సంభరమనిపించెగాని । మరి నీవిటకరుదెంచిన । మార్గమేమొ తెల్పుపూని ॥ స ॥

వ॥ యేమీా నీవు దొరోరిబిడ్డవేనా మరి వొక్కదానవు యిక్కడ్కెందుకు అచ్చినవో చెప్వు.

తా॥ నిక్కముగను నేనంతయు । నుడివెద నీతోనువిను । చక్కని తిప్పాయపల్లె । శ్రీహరిమన్నించునను ॥ని॥

సీ॥ మాపిన్నతండ్రియు మంత్రినిసైన్యాధి । పతిని మాతండ్రిని హతమొనర్చి । అటుమీాదననుతమ్ము నడవిలోఖండింప । భటులకొప్పగించి బంపియున్న । దయగల్గివారుమము తగవిడిచిపోయినం । తటనాకు మిక్కిలి దాహమయ్యె । కాననంబుననడ్వ । కాళ్ళురాకనునేల । బడియుంటినప్పుడదప్పి నడుగునిడక॥ గీ॥ అట్టి తరుణంబునను జలము కరిగి తమ్ము । డింతవరకైనరాడాయె నేమిసేతు । త్రోవదప్పెనో నాకెటు దోచదాయె । గానబడియున్న దెలుపుమి కరుణతోడ॥

వ॥ అయ్యా వింటివా నావృత్తాంతము యిక నాయందుదయయుంచి నాతమ్ముని గాంచియుండిన తెల్పుము.

దొం-వ॥ పిల్లా నాకదంత దెల్సిందిగాని యిక నిన్ను కాళికమ్మకు బలియిత్తాను నడువుము. (అనిన తార గడగడవణుకుచు తనలో)

తా-వ॥ హా సోదరా కనకసేనా యెందుబోయితివి తమ్ముడా (అని మూర్ఛిల్లిన తారను దొంగ యెత్తుకొనిపోవును).

జయసింహుడు ప్రవేశం - దర్వు.

జయసింహుండనువాడనురాది । జ్జయముందిన భూపాలుడరా ।

నయమానసుడను భయరహితుడనే । క్షయమొందించితి శత్రులరా ॥జ॥ కారణకర్తను కడుగంభీరుడ । మారసుందరాకారుడరా । భూరిగనాసరి వారలెవరుయిా। ధారుణియందున చూడగరా ॥జ॥ యీధర శ్రీతిప్పాయ పల్లెహారి । పాదపద్మముల దలచెదరా । వాదభేదములులేక జనంబులు । నాదుపేరుగొని యాడెరురా॥

వ॥ సుబుద్ధీ.

సు-వ॥ జయసింహభూపాలా మీకిదో ప్రణామంబు లాచరించు వాడను యేమియాజ్ఞ.

వాదం – దర్వు.

జ॥ క్షేమమ రాజ్యంబునగల । సర్వజనంబులకు ధీర । నామది వినగోరితిపుడు । న్యాయమువిడకున్నవార ॥క్షే॥

వ॥ నేబల్కినట్లు సర్వజనంబులు సుఖోపాయులై యున్నవారలేనా

సు॥ నరవరాత్మజాధిపమిా । వరయునట్లు జనములకును । అరమరేదిలేక సౌఖ్య । మనుభవించుచున్నరికను ॥న॥

వ॥ రాజేంద్రా మనరాజ్యంబున సకలజనులు సుఖంబున నున్నవారు గదా స్వామి.

జ॥ సంతసంబు నాయెనుమది । చాలగనాకిపుడువినుము । యింతె చాలు అవనీశుల । కింకవేరె నుండదనుము ॥సం॥

వ॥ సుబుద్ధీ సంతోషంబైనది నేనుగోరునదే ప్రజల మేలుగదా.

సు॥ ధారుణీశనొకసంగతి । తాము వింటిరొలేదో । క్రూరసేనుడన్నుధర । గూలనేసెననవిందూ ॥ధా॥

వ॥ నరేంద్రా దురాత్ముడైన క్రూరసేనుడు నిష్కారణముగా తన అగ్రజుండగు నుదయసేనుని జంపెనట నిజమేగావచ్చునా.

జ॥ అవునిక యీమాటనిజమె । అనృతంబుగాదుసుమ్మి । చెవులతో విన్నంతవార్త ! చెప్పతరముగానివింత ॥అ॥

వ॥ కావున యీవృత్తాంతము మున్నే వసంతుడు చెప్పియున్నాడు.

సు॥ వుదయసేనునకు తనయులు । వుండిరేమొకద రాజా । పదపడి వార్నెవరుబోంచ । ఖారపడితొరాజా॥

వ॥ రాజచంద్రా ఆ యుదయసేనునిబిడ్డల నెవరు పోషించుచుండిరో కదా.

జ॥ పాపిక్రూరసేనుడుయీా । బాలుల ఖండింపదలచె । పాపమునక వదినెనుతన । భార్యగవలచేడిపించె ॥పా॥

వ॥ సుబుద్ధీ యాక్రూరసేనుడు అన్నను జంపినదేగాక అన్నభార్య వదినెనువలచి బాలుల ఖండింపదలచెనట. కావున మనమిప్పుడే యుద్ధ సన్నద్ధులమై క్రూరునిఁదరిమార్చి వారిబాధ మాన్పిరావలయును లెమ్ము.

సు॥ సరిమంచిది మెచ్చితిమీా । పరోపకారంబునకై । ధరణిలో తిప్పాయపల్లె । హరినిదలచి పోవుదమిక ॥స॥

వ॥ రాజనగ్యా అటులే పోదాముపదుాడు.

(అంత దొంగ తారను కాళికాలయంబునకు బట్టి తెచ్చుచుండ తార శ్రీహరినిదలచుచు దుఃఖించుట).

తా - దొం - వాదం - దర్వు.

తా॥ రారశ్రీహరీ । నను । కారుణ్యంబునబ్రోవగ ॥రా॥ క్రూరుని బోలీనయట్టి । చోరుండూనన్నుబట్టి । జీరగొరెకాళికె యాహారముగా నివ్వదలచి ॥రా॥

వ॥ హా సర్వేశ్వరా నీవుందప్ప యిక నాకెవరుదిక్కు.

దొం॥ యెందుకెచింతా । నీ । అందానికియిటువంటెచ్ఛీ ॥ యెం ॥ కందువతోనిన్ను కాళి । కమ్మకు బలియిత్తునంటి । గుండబోకు సుక్కతార । ముందిగాన యీారోజున ॥యెం॥

వ॥ అబ్బా యిది యేమేమి ఇత్తా దేమేమత్తాది ప్రాణోయే యియ్యాల్ల సుక్కతారం కాళికమ్మకు బలిత్తనడువు.

తా॥ దిక్కునీవేగా । నా । చక్కనిదార రమ్మివేగ ॥ది॥ యక్కర గలిగిపుడునిన్ను । మక్కువతో వేడుచుంటి । గ్రక్కుననచ్చియునన్నిట । గాపాడుము చలమదేల ॥ది॥

వ॥ జగద్రక్షకా నాయెడ యించుకైన కరుణరాకుంజెనా కృప బూని రక్షించుము తండ్రీ. హా తమ్ముడా యెందుంటివి.

జ-వ॥ సుబుద్ధీ యిక్కడేమో నొక బాలిక రోదనముజేయుచున్నట్లు వినబడుచున్నదే.

సు-వ॥ రాజేంద్రా అయ్యో యెవడో చోరుండు యొక కన్యను కాళికా దేవికి బలియివ్వబూని పట్టుకపోవుచున్నాడు. రక్షించవలయును పదము.

ధో॥ యేడువేడువ్వా । నీ । యేడుపులన్నునుగుతాయి ॥ యే ॥ చూడగ నీవెంతోలావు । చిన్నపిల్ల వింతఘనము । వాడువీడుతమ్మొ డంచు । గోడుగోడు నేడుత్తుంటి ॥ వే॥

వ॥ పిల్లా యేడువకే ఆకాళికమ్మదగ్గర నీతమ్మున్ని జూపిత్తరమ్మొ బేగినడువు.

జ-వ॥ సుబుద్ధీ వారుయింక మనకు చాలదూరముగనున్నారు పరుగిడుదము రమ్ము. (అని పరుగెత్తుదురు).

తా॥ యేరినాకికా । గతి । యెవ్వరుయిట గానరారు ॥యే॥ నారాయణ మధుసూదన । నాగతినీవేయని పలు । మారుదలచి వేడిన దరి । జేరియుకడ తేర్చవదే ॥యే॥

వ॥ ఆహా శ్రీహరీ యిక నాశరీరము చాలించవలసివచ్చిన దేమొ కానిమ్ము యెట్టి యిక్కట్టులొచ్చిన నీస్మరణమరువను.

దొం॥ కాళికమ్మయూ । ఆ । కలిగొనియున్నది నడువే ॥ కా ॥ చాల పొద్దుబోయెనింక । సానమునాడించినీకు । పూలపేర్లుయేసెదతి । ప్పాయపల్లెహారిమెచ్చగ ॥కా॥

వ॥ బేగినడువే నీకు సానమాడిచ్చి పస్పుపూత్తా పూలపేర్లేత్తా కాళికమ్మకు బలియిత్తనడు.

(అంత కాళికాలయంబుజొచ్చి తారను నిల్వంబెట్టి)

దొం-వ॥ పిల్లా కాళికమ్మనుజూత్తివా యిక నీవాలమ్మోర్కు దండంబెట్టు (తార పలుకకున్న) యిదో నాచేతుల యేమున్నదో చూశావా. (అనిన తార గడగడవణకుచుండును).

జ-వ॥ సుబుద్ధీ యీచోరుండు కాళికాలయంబు జొచ్చియున్నవాడు మరుగుననుండి వానిని సంహరించవలె వింటివా,

సు-వ॥ దేవా అటులేగావింతము.

తా-గీ॥ అంబజగదాంబ యోకాళి కాంబనన్ను । మ్రింగజూతువా చోరుడీ భంగిజేయు । భర్తురాలనుగాదనఁ బాధపెట్ట । న్యాయమేనీకు నన్ప్రోవు నళిననయనీ॥

వ॥ హే లోకమాతా తల్లిదండ్రులులేని యబలనగు నన్ను కరుణించి రక్షించుముతల్లీ జనలోక కల్పవల్లి.

మత్తకోకిల.

దొం॥ పిల్లవిను తిప్పాయపల్లెలో । పటుతరంబుగ వెలసినఁ । నల్లనయ్యాయువచ్చివిడువుము । టన్న వినుమనునిన్నికఁ । కల్లగాదీకాళికమ్మకు। కరములెత్తియు మొక్కుముఁ । వల్లవాధరిఖడ్గమిదొగను । పట్టిద్రుంచెద క్షణమునఁ॥

(అని కత్తి చేతబూనిన తార వణకును)

దొం-వ॥ యేందే యేమొ వనుకుతున్నవు.

తా-వ॥ అయ్యా నీవు ఖడ్గముచేబూనియుండుటజూడగా నాశరీరము గడగడవణకుచున్నది యికనైన మన్నింపుముతండ్రీ.

దొం-వ॥ యేందే నీకు కూడుబెట్టిసాకుటానికి దెచ్చిన్ననుకున్నవా బేగిమొక్కు (అని తలవెండ్రుకలనుబట్టి వంచును అంతలో జయసింహుడు అట్టివాంగను చిక్కబట్టి).

జ-వ॥ వోరేవోరే దురాత్మా అబలయగు నిర్బాలికను జంపబూనితివా యిదేకాళికి నిన్ను బలియిత్తునుచూడుము. (అని వానిని సంహరించును తార జయసింహునిగాంచి)

తా-వ॥ మహాత్మా మీకిదే పదివేలవందనములొనరించెద నన్ను కటాక్షించుము తండ్రి.

జ-వ॥ బాలికా వర్ధిల్లుము గాని నీవెవ్వరో నాకుం దెల్పుము.

జ — తా — వాదం — దర్వు.

తా॥ యేమని తెల్పుదునూయో । స్వామీ నావృత్తాంతము । శ్రీమహేశుడావానీవు । శ్రీశుడవో తెలియమిమ్ము॥

వ॥ మహానుభావా నేటికి మీవలన బ్రతికితినిగాని నాశ్రమలేమని వచింతును స్వామీ.

జ॥ బాలనిన్నుగన నామది । జాలినొందె నీవెవరో । చాలగవచి యింపుమునీ । కేలగలిగెనో శ్రమలు॥

వ॥ పుత్రీ యేను భూమీశుడనుగాని జగదీశ్వరుడనుగాను. నీవు నన్ను పెంపుజేయక సర్వము దెల్పుము.

తా॥ తలిదండ్రుల తమ్మునియీ । ధారుణిలో ల్పోజేసె । నళినసంభవుండు నోదుట । వ్రాలు కఠినముగవ్రాసె॥

వ॥ వోదివ్యపురుషా అందరినిలో ల్పోయి మిక్కిలి గుందుచున్నదానను గదా.

జ॥ యింతకుముందంత కష్ట । మేలగలిగెనో కాని । సంతసముగ నీవారల । సంగతిదెల్పుము పూని।

వ॥ బాలికా నీతలిదండ్రుల సంగతిదెల్పిన సర్వము నెఱుగనౌను గదా.

తా॥ భువిలోలేనివారికేరు । బాగుడనేమిసార్థకంబ । సవినయంబు గానుయట్టి । సంగతినోటనము దంబ॥

వ॥ తండ్రీ వారిపేరుదీయ నామది దుఃఖము పొంగిపొరలునుస్వామి.

జ॥ పుత్రీ నీవట్లననా । యాత్మయు నీరయ్యెనుగా । ధాత్రిలో వారేమయ్యిరి । తగవచియింపుము వేగా॥

తా-వ॥ బిడ్డా నీవట్లన నామది కడురంజిల్లుచున్నది కావున ఆలసించక నీజననీజనకుల నామధేయములు వాక్రుచ్చుము.

తా॥ అయ్యా నేనుదయసేను । డను భూపాలునిపుత్రిని । చయ్యన పినతండ్రియుమా । జనకునిజంపెను ధాత్రిని॥

వ॥ అయ్యా యే నుదయసేన మహీపాలుని పుత్రికను మాపినతండ్రియగు క్రూరసేనుడు మాతండ్రిని జంపినదేగాక మమ్మింత శ్రమలపాలు జేసెనుగదస్వామి.

జ-వ॥ హా బిడ్డా నీవు ఉదయసేనుని కూతురువా యేను జయసింహ భూపాలుడను మీజనకునకు స్నేహితుడనే మీకెంతటికష్టకాలము సంప్రాప్తమైనది తల్లీ.

జ॥ చింతేలను నీమనమున । యింతలో మాఇంటికినీ । సంతసమున బోదమునీ । వెంతయు వెనుదీయకుమీ॥

వ॥ బాలికా అయినకార్యంబునకు చింతిల్ల నేమిప్రయోజనంబు కావున మాఇంటికిబోదము రమ్మా.

తా॥ సరె మీారనురీతిగనే । నరుదెంతును భయమదేమి । కర మొప్పగ తండ్రివిధము । గాచినాడ వీనెస్వామి॥

వ॥ కావున మీాకన్న ఆప్తులు నాకెవరున్నరు మీారనువిధంబే వచ్చెదను.

జ॥ బాలిక తిప్పాయపల్లె । పోలున నివసించినయీా । నీలవర్ణుడైన శౌరి । యేలగలడు నగధారియు॥

వ॥ బాలికా అంతటికి యీాసర్వాంతర్యామియే కలడురమ్మా.

తా-వ॥ సరి అటులేపోవుదము పదుము (అని వెళ్లుదురు)

అరణ్యములో కనకసేనుడు.

కన-వ॥ అక్కటా యిదియెంత వింతగానున్నది నేను వచ్చినదారి యగుపడకయున్నదిగదా యెంత దిరిగిచూచినను మద్భగినియగు తార గనబడకున్నది. యిక నేనేమిసేయుదు ఆహా శ్రీహరీ మమ్మెంత శ్రమ బెట్టుచున్నాడవు.

దర్వు॥ తలిదండ్రులబాసియునిం । దరుదెంచినయిట్లుజేయ । ఫల మేమియుమాయెడ పసి । బాలులమయ్యా నుశ్రేయ । శ్రీహరిమద్భగిని తార । దాహముగొన జలముకేగ । సాహసించి మమ్ముబాప । సమకట్టితి వేమొబాగ । కరివరదుడవీవుగావ । కరుణించియుబ్రోవరావ । మరనీ చరణములనెపుడు । మరువలేదు దేవదేవ । యీాధర తిప్పాయపల్లె । మాధవనినునమ్మియుంటి । బాధగొలగజేసినాదు । భగినిజాడదెల్పుమ టి॥

వ॥ ఆహా శ్రీహరీ యెంతవేడిన యించుకైన దయరాకుండెనా అయ్యో అక్కా యెందుంటివి. యిక నేనీపుడమియందు ప్రాణంబులతో నుండిన ప్రయోజనమేమి అదో ఆపాషాణమునకు తలగొట్టుకొని ప్రాణ ములు విడిచెదగాక (అని యుఱుకును అంత నొకయోగి గానంబడి)

యోగి-వ॥ పుత్రా నీవెవ్వరు యేల నిట్లు శోకింపుచు యొంటరివై పోవుచున్నావు నాకుండెల్పుము.

యిద్దరికివాదం దర్వు.

కన॥ వందనమయ్యా । వో । పరగుణయోగీశ్వరనా ॥వం॥ యిందున

నావృత్తాంతము । యింపుతోడ నడిగితిరి । అందమొందదెల్పగనో । రాడకుండెగదనయ్యా ॥వం॥

వ॥ అయ్యా మీరలు నావృత్తాంతము నడిగితిరిగాని నేనేమనివచి యింతును. (అని దుఃఖించును).

యో॥ రాజనందనా । నీ । వీజగములో చింతపడకు ॥ రా ॥ భూజనులలో మెప్పువడసి । భాగ్యవంతుడవునయ్యోటి । తేజముగలదిట్లు నీవు । తోచక విలపింపతగదు ॥రా॥

వ॥ కుమారా యేల దుఃఖించెదవు జయప్రదంబును బొందగలవు కావున యూరుక్కుండుము,

కన॥ మునికులతిలకా । మీ । రనువాక్కులు వింతదోచె ॥ము॥ జననిజనకులను గోల్పో । యిన వాడనై యుండి యిచట । అనయము మద్యగినిజాడ । లరయక వేసారితింక ॥ము॥

వ॥ స్వామీ జననీజనకులను గోల్పోయినదేగాక యీయడవినందు మాఅక్కను బాసి గాసినొందుచున్న నాకింకెక్కడి జయము.

యో॥ బాలకవినుమూ । యా । జోలిదీయబోకుమికను ॥బా॥ చాలగనీవింకజాలి । మాలియేడ్చుచున్నవారు । సేలుగనీచింతమాన్ప । జనుదెంతురు తెల్పుమింక ॥బా॥

వ॥ కావున నీవిట్లు దుఃఖించుచున్నచో వారువచ్చి నీదుఃఖమును మాన్పగలరా యేల యీ పెరిభ్రిమలు నామాటవినుము.

కన॥ ఆశలుయేమో । అడి । యూస జన్మభ్రాంతిదీరె ॥ఆ॥ వాసిగ నాకేమోయింక । వచ్చును సౌఖ్యంబటంచు । మీానువాక్కువింటినియా । మీదనాకు దోచదాయె ॥ఆ॥

వ॥ మహాత్మా మీావాక్కులు కడుదుర్లభంబని తోచబడుచున్నది గదా.

యో॥ తప్పకనీవూ । యీ । దారిని వెళ్ళితివేనియు ॥త॥ గొప్ప శుభముగల్గు కల్ల । గాదు దివ్యదృష్టిజూచి । చెప్పితి తిప్పాయపల్లె । శౌరి నీకు జయమొసగును ॥త॥

వ॥ కావున యిపుడు నీవు యీమార్గమున బోయితివేని తప్పక మేలౌను నామాట నమ్మిపొమ్ము యికనే వెళ్ళుచున్నవాడ.

కన-వ॥ మునివర్యా మీరానతిచ్చిన విధంబుననే వెళ్ళెదను. నన్ను ఆశీర్వదించుడు మీకిదే ప్రణామంబు లాచరించుచున్నవాడ.

యో-వ॥ దీర్ఘాయుష్మాన్భవ (అని నిష్క్రమించును అంత కనక సేనుడు కొంత దూరమేగినపిమ్మట)

కన-వ॥ ఆమునివరుండు బలుకురీతిగనె నింతవరకే తెంచితిగాని యించుకేని మేలు చేకూరకున్నదే. (అని ముందుకుజూచిన నొకపట్టణంబు గాన్పించును) ఆహా యీపట్టణంబెవరిది కాబోలును. యెంత శృంగారమై యున్నది దీనినొకసారి వర్ణించెదగాక.

దర్వు॥ ఎంతో శృంగారామీ । అంతారంగమునందు । కాంతియై యొప్పెఘనంబు । యీపట్టణంబు । వింతాయితో చెమనంబు ॥ కనకామయమైనయట్టి గోపురములు యద్దాలు । గలిగియున్న మంటపంబులు । యీపట్టణంబు । ఘనవిచిత్రమగు భవనములు ॥ చుట్టూ ప్రాకారమూలు। గట్టినట్టికోటలుయిక । నట్టికందకముల్ గలంగు । యీపట్టణంబు । నట్టి స్వర్గమనంబరంగు ॥ ధారుణితిప్పాయపల్లె । ధాముఢయ్యీవెలయుచక్రి । ధారియు కూరిమినాయెడను । యీపట్టణంబు । దారినిజూపించె వేగను॥ఎం॥

వ॥ ఆహా సర్వేశ్వరుండు నాదీనాలాపంబులు విని నాకిట్టి నగరంబు జూపించియున్నవాడు సరి మంచిదిగాని యిందొకద్వారంబు మూయబడి యున్నది తెరచి లోనికిబోయెదగాక. (అని ద్వారంబుఁదెరచి లోనికి బోయిన నొకభటుండు కనకసేనునిగని)

భ-క॥ వందనములు మీరెవ్వరో । బృందారకరూపనీదు పేరెయ్యది లన్ । సుందరవిగ్రహుడవునీ । యందముదిలకించమిగుల నాశ్చర్యమగున్॥

వ॥ అయ్యా మీరెవ్వరు మీజననీజనకులేనామంబు గలవారలో తెల్పుడు.

కన-క॥ ఏమని తెల్పుదునాశ్రిమ । భూమినిగలరెందునన్ను బోలిన వారల్ । ధీమంతకనకసేనుడ । నీమహినేనుదయసేను నీతనయుండన్॥

వ॥ నేను ఉదయసేనమహీపాలుని పుత్త్రుండనగు కనకసేనుండను యీనగరము పాలించువారెవరో తెల్పుము.

యిర్వురికివాదం — దర్వు.

భ॥ ఈపట్టణమందునగల । భూపాలుడు జయసింహుడు । పాపము

మీతండ్రినిగో । లోపైయితిరని జనియున్నడు॥

వ॥ ఆహా కనకసేనా మీకష్టంబులు మాకిదివరకే నెలవైనవి. మాజయసింహుడు కౄరునిబరిమార్చుటకై జనియున్నాడు వింటివా.

కన॥ మంచిది అటులైతెను నే । నించుక క్షుదగొన్నవాడ । కొంచెము నాకిపుడన్నం । బంచిన మేలౌనుచూడ॥

వ॥ కావున నాకు మిక్కిలి క్షుదయగుచున్నది యిట్టి క్షుద్బాధ దీర్చిన బాగుండునుగదా.

భ॥ అందులకై మీమనమున । సందేహము నొందవలదు । పొందుగ భోజనశాలకు । పోదము రారమ్మికపదుడు॥

వ॥ అయ్యో రాజనందనా మీరెంత అలసియున్నారోకదా యిపుడే స్నానసంధ్యానుష్ఠానములు దీర్చుకొని భుజింతువు పదుము.

కన॥ సంతసమాయెను నేటికి । సర్వంబును జయమాయెను । యింతలో నీవనువిధియే । కెంతెను స్నానముజేయను॥

వ॥ సరి నీవనువిధంబున స్నానముజేసి భుజింతునుపద.

భ॥ చిన్నరాజ వినుమింకను । జయసింహుడు రాకుండెను । మన్నన తో రాజ్యమేలు । మహిజనులింపొందగాను॥

వ॥ రాజేంద్రనందనా మాజయసింహభూపాలుడు యింతవరకైన రాకయుండెను. వారు వచ్చునందాక మీరీరాజ్యమేలుడు.

కన॥ సరి నీవనురీతిగనే । జనులను పాలించువాడ । ధరణిలో తిప్పాయపల్లె । హరికృప యెటులుందోచూడ॥

వ॥ మంచిది అట్టులనే రాజ్యము పాలించెదను లోనికిబోవుదము రమ్ము.

భ-వ॥ రాజనందనా యికనీవు భుజించి కొంచెము విశ్రమింపుము.

(అని నిష్క్రమింతురు).

బెస్తబోయిలు ప్రవేశం - వాదం దర్వు యాలలు.

అ॥ పోదమురా యేమిరోరి । బుచ్చిగా సావలకెళ్ళి । పొద్దుయెంతెక్కిందోచూడురా । యేమైనా పెండ్లం । వద్దనే కూసుంటావేమిరా॥ యే॥

వ॥ బుచ్చిగా ఓరి బుచ్చిగా సావలకెల్లద్దురా యేమైన పెండ్లాన్ని జూసుకుంట కుండకాన్ని కూసుంటావుర యిట్లయితె యెట్లబతుకుతవురో.

బు॥ నత్తిన త్తీగయుండుగోరి । మత్తినీకొచ్చిందీవారి । బెత్తకులము లోన నీవోలె । అచ్చిగాచూడు । ప్రత్తిగానె పెండ్లంజోలీలే ॥అ॥

వ॥ అచ్చిగా అబ్బా నీపెద్దిర్కంగాల యేంపోకడరా నాపెండ్లాము ముందర మాట్లాడేమాటిదేనారా.

అ॥ తప్పారా నేనన్నమాట । గుప్పనామందెగురూచుంటి । చెప్ప టికింట్లనె పంటావ । బుచ్చిగలావు । గొప్పగా మాట్లాడుచుంటీవా ॥బు॥

వ॥ బుచ్చిగా పాపమూ అడివిరా యేమోవూరుకూకెనే పెద్దిర్కం గిద్దిర్కమని మాట్లాడుతుంటివి.

బు॥ మాటలాడకుం డినూనీ । నోటికొచ్చినట్లువాగ్రె । సాటివారు వింటేమంటరారొ । అచ్చిగనాకు । కూటికిలేకుంటిత్రివారా ॥అ॥

వ॥ మాట్లాడకపోతె నీనోటికచ్చినట్లు అదురుతె యెవలూకుంటరా.

అ॥ పదురుబోతునంచునన్ను । బెదురులేకపల్కుచుంటి । వదెరనీకు పిచ్చిబట్టిందా । బుచ్చిగనీసు । ముదిరిపోయినట్లుందిచూడా ॥బు॥

వ॥ బుచ్చిగా నేనునిన్నన్నది చెడిపోయెతందుకారా యేమొ అదుపుతున్ననబడితివి పీసుముదిరిందా.

బు॥ పీసుగీసు ముదురుడంటే । పోసిమొగడా నిన్నుబట్టి । కోసిపోగు లేసేదానురా । అచ్చిగనోరు । మూసుకొ లేకున్నయిడువారా ॥అ॥

వ॥ అచ్చిగా నీకు యింతబలమువడిచ్చిందా నోరుమూయి యెక్కు మాట్లాడకు.

అ॥ యింత కావరంబానీకు । యెంతజెప్పినాను ముత్తె । మంతబుద్ధి రాకపోయెరా । బుచ్చిగనాతో । రంతుమాను బతుకలేవ్రారా॥

వ॥ బుచ్చిగా నీకెంతజెప్పిన మెడబలమితనమిడుత్త లేవు. భూమిమ్మీద బతుకబుద్ధున్నదా లేదురా.

బు॥ బెత్తకులములో పెద్దాకు । లత్తుడాపై పటికెనార । సత్తె గెల్వానియ్యకుంటివి । అచ్చిగనన్ను సూత్రిసూత్రినె మాటలంటివి ॥అ॥

వ॥ అచ్చిగా నీవెఃుగూడుక బెత్తకులప్త్రిన్నని అట్లంటె మంచిదేనా.

అ॥ యేదాపోనియి వచ్చిరాని । వాదులాడెందాకు మనకు । పోదమూనాపలకు లేదురా । బుచ్చిగపొద్దు । బోదయేము చాలుపా గదరా ॥బు॥

వ॥ బుచ్చిగా యిట్లమనము మాట్లాడుకుంటుంటె పొద్దల్లి యెంతె క్కుంటొసూడు. యిగ సాలించిపోదామా అద్దురా.

బు॥ చాలురాతిప్పాయపల్లె। ప్రోలు శ్రీనర్సింహులుగారియొక్క। లేలలు గొని యాడుకుందాము। అచ్చిగయింక। వొలలుదీసుకొనియెల్దాము॥అ॥

వ॥ అచ్చిగా యింక జూసేదేంది పెద్దొలలుదీసుకొని పోదాంపా అసా. (అని సముద్రానికెళ్ళుదురు).

బెత్త పోసి ప్రవేశం – దర్వు.

యీజగములో నన్ను జెత్త। పోసీయని పిలువగలరు। తేజముగల దానవంచు। తేపకుగొనియాడగలరు॥ నాకుడగిన మొగడుగాడు। నల్ల ముఖము అచ్చిగాడు। యీకాలంబునకుయీడు। యేదోమనువాయెనాకు॥ సముద్రాయినేటికైదు। సమ్మచ్చరములునాయెను। యిమరసతో ఆరు గురిని। యిడిచి తిర్గితిర్గి నేను॥ యిపుడుయీనికచ్చియుంటి। యేస్తరిబిడ్డలను గంటి। కపటుడు యీమొగడునాకు। గంజిబోసిసాకడంటి॥ చిలపట యెప్పటికియింట। విటులజేరిపండుకుంట। పటుతరముగ సముద్రాడు। పడుచువోలెనుంటినింక॥ మరియిప్పుడునెలదప్పెను। గరిగెలమాసకు పొద్దులు। సరిగనిండెనేమొ నేడె। టకుగ యీలులేదుచాలు॥ కావున తిప్పాయపల్లె। కరివరదుని దలచినేను। భావమలర యింటిలోన। బడి యుండెద తిరుగలేను॥

వ॥ యేమిా యీయ్యాల్ల నామొగడు సాపలకెల్లి యింక రాకున్నడే అందుదామంటె యింట్ల కసికెడిత్తులులేవు అచ్చి యేందింటడో సూత్త యీని తలపండువల్ల. (అని నిష్క్రమించును) అంత (అచ్చిగాడు బుచ్చిగాడు సముద్రముజేరి)

అ–వ॥ వొరెబుచ్చిగా నేను యీరేవుకు వొలేత్త నీవారేవుకు బోయి వొలెయ్యి యిద్దరమొక్కతాన్న యేత్తెట్లరా.

బు–వ॥ ఔరా నీవీరేవుకు వొలేత్తె నేనారేవుకెల్లి వొలేత్తా. (అంత అచ్చిగాడు వలవేయ అందు విమల జిక్కుకొనుటంగని).

అ–వ॥ యేమిా నేనువొలేత్తె సాపరావల్నా చక్కని ఆడిదొచ్చింది యి.దేమిచిత్తరం బుచ్చిగానికిజెప్పాతె.యేమంటడో యేమొ. యెవలకు జెప్పక యిదే ఇంటికి దీసుకెల్త (అని విమలతో) పిల్లా నేను సాపలకని

వొలేత్తె అండ్ల నువ్వొత్తివి. నన్ను పెండ్లి జేసుకుంటావా. మాఇంటికి పోదాం నడువు.

(విమల తనలో)

వ॥ ఆహా శ్రీహరీ యాశ్వారునిబాధ దప్పించుకొని యీసముద్ర మునబడిన ప్రాణంబులు బోకయుండి మరల యీదుర్మార్గునిచేతికి జిక్కితిని. వీడు నన్నేమిజేయునోకదా. (బెస్తవానితో) అయ్యా నేను భర్తలేని విధవరాలను. అదిగాక పెద్దమనిషిని. కావున నీవు నన్నిట్లనుట పాటిగాదు. దయజేసి విడిచిన నీకు పుణ్యముగల్గును వింటివా.

అ-వ॥ యేందే పాపమని నీల్లల్లనుంచి గడ్డకుతీసినందుకా నేంజెప్పి నటొప్పుకొనకపోవుటం నడువు (అని తీసుక వెళ్ళిన బుచ్చిగాడు).

బు-వ॥ యేమిరా అచ్చిగాడు నన్నారేవుకుబోయి వొలెయ్యిమని నాకు కలకనేయెల్లిండె ఆనికెంతపెద్ద పాపరపడ్డదో అందుకే నాకు పొత్తి య్యబడుతదని చెప్పలేదు. నాకెన్నడన్న పెద్దపాపరబడనాడు పొత్తియ్య మని అడుగుతె సూత్త (అని వెళ్ళును).

( అచ్చిగాడు విమలంగని )

అ-వ॥ పిల్లా అదో మాఇల్లుసూత్తివా యిగనన్ను పెండ్లి చేసుకో నిన్ను సాల సుఖపెడ్తాను. యేమంటావు (విమలాదేవి పలుకకుండిన).

వాదం - దర్వు.

అ॥ చిన్నదాన రావెరావె । నన్నుపెళ్లి జేసుకోవె । వున్నదంత వొప్పగిస్తా । నిన్నెచాల యెక్కొజూత్త॥

వ॥ యింగోయిన్నవా నన్ను పెళ్లిజేసుకో నేను మంచోన్ని నాపెళ్లాం మంచిదిగాదు నీవు మంచిగున్నవు నిన్నే యెక్కొజూత్తాను.

వి॥ తగదుతగదు నన్నుగోర । ధర్మముగాదయ్యనీకు । పగయేలను నాపై యింత । భ్రాంతిజెంది పైకిరాకు॥

వ॥ అయ్యా నీకు భార్యగలిగుండ నన్నేల భంగపెట్టెదవు.

అ॥ పిల్ల నాదుపెళ్లము నను । వల్లనన్నమాట యెపుడు । కల్ల గాదు నీవుదాన్ని । కాలదన్నినట్టులుండు॥

వ॥ యింటివా నాపెళ్లాముకు నామీద యిట్టంలేదు అయితె నీవు దానిమొఖంమీద గొట్టినట్టుంటె యేంజేత్తదో సూత్త యేమంటావు.

వి॥ యిదియేమిా నీదు తల్లి । విధమని నన్నెంచకాను । మదిలో నీవిట్లుదలువ । మర్యాదజెటులౌనుమాను॥

వ॥ అయ్యో నేను నీకు తల్లి సమానురాలను కావున నన్నిటుబలుకకుము పాపము ఘటించును.

అ॥ వుత్తుత్తంగానె పాప । మొత్తాదనవేలానె । బెత్తోల్లందరికి నేను । పెద్దకులత్తునిగానే॥

వ॥ అబ్బో నేనెవన్ననుకున్నవు. బెత్తోల్లందరికి పెద్దకులత్తున్ని. పాపంతగులుతదంటవు మాఅవ్వవా మానాయిన్న పెండ్లానివా.

వి॥ కటకట నాయందునింత । కఠినము దలపోయతగున । కుటిలంబును లేకనన్ను । కృపతోగా పాడినఘన॥

వ॥ అయ్యో నీవు నాప్రాణంబులు గాపాడినందువలన నాకు తండ్రి సమానుండవు కావున నన్నుగోర తగదు.

అ॥ బాయిలబడ్డోల్ల పైకి । దీయ బిడ్డలె తారె । పోయిలేనిదాన నాతో । జెప్పిన విసెటోడెనడే॥

వ॥ వొసే బల్మికి పెండ్లాము నీల్లలబడ్డదనుకో మొగడు గడ్డకు దీసిండనుకో అప్పుడాల్లు తండ్రిబిడ్డలేనా చెప్పు.

వి॥ యెన్నియేమయ్యినాను । యేనైతేసికిప్రుడను । కన్నాకూతురు కన్నా । మిన్నానెపలికెదాను॥

వ॥ తండ్రీ నన్నుగురించి నీవిట్లుబలుక పాడిగాదు నన్ను విడువుము.

అ॥ అబ్బనిన్ను యిడిచినేను । అప్పుడునేపానముబను । గొబ్బున నినొక్కదెబ్బ । గొట్టినినిపించెదాను॥

వ॥ యేమిా నేనుజెప్పితె నీవుకొంచాన యిసేటట్టు లేవుగాదె. దెబ్బేత్తునా లగ్గం చేసుకుంటవా చెప్పు.

వి॥ తిప్పాయపల్లె జగ । దీశా హరిసర్వేశా । వొప్పుజాలనింక నన్ను । విషమపరీక్షలుశాయకు॥

వ॥ హా జగదీశ్వరా యేలనన్నిట్లు బాధపెట్టెదవు. యిట్టి కష్టములకన్న వొక్కసారె ప్రాణములుతీయరాదా. (అని ప్రకాశముగా) అయ్యో నీవెన్నివిధంబుల భయంబుజూపినను నీమాట నేనొప్పను. నన్ను సముద్రమునుండిలీసి కాపాడితివిగాన మళ్ళి నన్ను దేసముద్రమున బడవేయుము.

అ॥ అబ్బో నాపానంబోయిన సిన్నిమల్ల సముద్రము లేత్తనా. అట్లొద్దు నన్నులగ్గంచేసుకో లేకుంటె సాల కట్టపెటితసూడు.

(అంతలో పోసివచ్చి మొగనితో)

పో-వ॥ అరేఅచ్చిగా నీతలపండుబల్ల ఆదోతిగా.

అ-వ॥ యేందే అదా చిన్నపెళ్లాము.

పో-వ॥ నాకుక్కలకొడుక్కు యింకో పెళ్లాసుట (అని కొట్టును)

అ-వ॥ లంజముండా నీబాంచెను కొట్టకే.

వి-వ॥ (తనలో) ఆహా యిదియేమి యీసతీపురుషుల సరసోక్తులు యేమాత్రము భయభక్తులను మర్యాదలే లేవుగదా. యీదుష్టులు నన్నేమిచేయుదురో శ్రీహరీ యికనాకు నీవేదిక్కు.

పోసి మొగనితో వాదం దర్వు.

పో॥ కొట్టాకుమంటేమిరా । అచ్చిగా । కూడేమిదింటావురా ॥అ॥ పట్టాపగలామెసరు । బెల్లాండదిక్కేది । పొట్టాకిత్తులు లేవా । సెల్లెకుక లేకపాయె ॥కొ॥

వ॥ ముండకొడుకా దంచండుదామంటె యింట్లసారెడిత్తులున్నయా తులమెత్తువ్వాగతున్నదా యిగనీకేమండిపారెమ్యాలెరా.

అ॥ కొట్టాకు తిట్టాకమూ । వోపోసి । కోపంబుచెయ్యాకుమా ॥ వో॥ బుట్టెడసొన్నిజిమ్మల్ । ఎత్తుకొచ్చినాను । అట్టేయువ్వమిమ్మామన । పొట్టాకుదిందాము ॥కొ॥

వ॥ లంజముండా సొపలు బట్టుకరాలేదని కొట్టేనా అగో అంద్లన్నయిసూడు అవ్వమ్మి గింజలుదెచ్చి తిండంగరాదే.

పో॥ పొయ్యామీదికిలేవురా । అచ్చిగా । పొయ్యాకిందికిలేవురా ॥ అ॥ పోయిపోయచ్చినను । పోకజతోలంటటి । వియ్యాకుదాన్నేడ । మొత్తాకత్తివిమొగడా ॥పొ॥

వ॥ మొగడా పోయిపోయి యిన్నిసావలు బట్టుకచ్చి ఆడెయ్యంగనె ఆయెనా. యెన్నుంటె సంసారం. నిన్నగాజంకె యెంకటరెడ్డిపటేలు కాళ్ళమీద నరెడ్ల నరిసింహారెడ్డిపటేలు కాళ్ళమీదబడితె అసేవని గిరద్దెదుగింజలుయిత్తె దంచిఅండితె కమ్మగదింటివి నేంజేసింది నీకేరుక పడ్తందా. నాబాంచెలకొడుక.

అ॥ యేందే నువ్వేమొలావ్వూ । వోపోసి । యేం దెచ్చీపెట్టినావ్వూ ॥
వో ॥ మందోలె నేనిన్ను । మాటనకున్నందూక । వందీలంజామొండా ।
బరోల్నే వోరుతుంటివి ॥ వేం॥

వ॥ యేందే యేమొ బర్రోల్నే వోర్తున్నవు యేందెచ్చిపెట్టినవే నాకు.

పో॥ వోరీ నా బాంచె కొడుకా । అచ్చిగా । బర్రోలొర్తానంటీవా॥
అ॥ చీరేదిరయి కేది । ఛీ నాకుక్కలకొడుక । వారూవీరిత్తెల్లె । మారూ
లేదిడిసేత్తె ॥వో॥

వ॥ ముండకొడ్కా కట్టుకోనచీరున్నదా తొడుక్కోన రయికె గతున్నదా ఆదోపతిమల్లవ్వ కవుకచల్లగుండ పాతచీరె పాతరయికె పాపం బొడ్డిపటేఅనియిత్తె కట్టుకుంటి తొడుక్కుంటి మల్లడిసేత్తామంటె మారులేకపాయె. నా బాంచె కొడుక నిన్ను జేసుకొని యేంసుకపడ్డరా. (అని కొట్టును).

అ॥ వద్దూనాకికచాలునే । వోపోసి । రద్దీనాతో యేలానె ॥ వ ॥
ముద్దూగనేనుంను । మరిదీన్నిజటూక । పొద్దూగాలలేసి । పోయేనా
యిల్లెల్లీ ॥ వ ॥

వ॥ పోసి యికనాకు నీతోని సంసారంజెయ్య సాతగాదు. నాయింట్లకెల్లెల్లిపో.

పో॥ యెక్కడికో పొమ్మంటివిరా । అచ్చిగా । యెవలబట్టూకో
నుందువురా ॥అ॥ అక్కాడిక్కడదిరిగి । మూడాదెత్తివిదాన్ని । నికా
ముగను జెప్పు నినుదన్నాకూడుండ ॥యె॥

వ॥ కుక్కలకొడ్కా నన్నాడికో పొమ్మంటివి. యెవలబట్టుకోనుంటవురా అదెవతో చెప్తవా యింకగావాల్నా.

అ॥ యిగ జెప్తానను నన్నిడువే । వోపోసి । పగయేలా నాతో వినవే।
వో ॥ జగతీలో వలయెవలు । మొగలాగొట్టగజూడ । పోగరంగెతిప్పాయ।
పల్లీశుసొచ్చింగ ॥యి॥

వ॥ వోసేముండా యిటినుు. నేను సాపలకెల్లి వొలేసితీశాలకే అండ్లిదచ్చింది. చూశాలకో నాకండ్లు మూసుకపోయాయి. నీకుతోడుంట దంటదెచ్చిన పెళ్ళిజేసుకొమ్మంటె యింటలేదు యిన్నవా.

పో-వ॥ గోరి యెవరనాయలా నాకే కూడుబెట్టచాతగాక యేడు త్తున్నవు. నీమొకానికి యింకో పెళ్లా మా. (అని చీపురుతో కొట్టును).

అ-వ॥ (తనలో) దీన్ని వొక్క దెబ్బకె కిందబడదందుగాని అల్గిపం డెనా మూడొద్దుల్దాక మడెంక తాది. అందుకే చేసినట్లుజూడాలె. కొట్టి నట్లుబడాలే. పెండ్లాం పెద్దగురువనేసాత్రి మఖద్దమా.

పో-వ॥ వొసే యిక్కడినుంచెల్లు (అని విమలను వెళ్ళించి నిష్క్ర మింతురు. అంత విమలాదేవి పరుగెత్తిపోయి వొక అరణ్యంబుజేరి)

వి-వ॥ ఆహా శ్రీహరీ యేనోముఫలముచేతనో యాస్త్రీవలన యీదురాత్ముని బారినుండి తప్పింపబడి యీఘోరారణ్యంబు జేరితిని. యిక యెచ్చటికేగుదును.

(విమలాదేవి శ్రీహరిని ప్రార్థించుట)

దర్వు॥ కమలనయనుడా । యీకష్టముకేనోర్వజాల ॥క॥ అమ రార్చిత నన్నిలకడు । అనురాగముజూచువిభుని । యమపురికంపెను క్రూరుడు । యేతెరి జీవింతుస్వామి ॥క॥ తనయులనాకనులజూడ । వనమున జంపగబంపెను । జనుదెక్కడ అప్పలునా । కును గలరెవరింకతండ్రి ॥క॥ యిట్టి నిర్భాగ్యురాల । నెట్టుల సృష్టించితివి । గట్టిగ నీహృదయమింత । గరుగకుండెనా బోవగ ॥క॥ ధారుణి తిప్పాయపల్లె । ధామా శ్రీరామ నామ । చారుతరంబుగనన్నిల । నవరించుముపరంధామ ॥క॥

వ॥ శ్రీహరీ యీదురాత్ముడు నాభర్తను జంపినదేగాక ముక్కు పచ్చలారని ముద్దుబిడ్డలను అడవిలోజంప భటులకొప్పగించి పంపెను. వారిని దలంచుకొనిన నాకడుపు భరించకున్నది. యికనైన నాదీనా లాపంబులాలకించి కాపాడుము దేవా,

రాంజెట్టి ప్రవేశం దర్వు.

శెట్టినినే రాంజెట్టనువాడను । పుట్టినదాదిగ బేరములాడుచు । యిద్దరిభార్యల బుద్ధితోజేసుక । అగణితవైభవ మనుభవించుచు । వుంటిని నేను । వుల్లాసమునా । పరగయిలను తిప్పాయపల్లెలో । మిరుపవరుగు కడుమిక్కిలిగలదట । పెళ్లివలయునే వేగిరముగను । రామారామా రఘుకులసోమా । ఆహారామా అయోధ్యరామా । జయుజయరామా । జానకిరామా॥

వ॥ ఇప్పుడే నేనాతిప్పాయపల్లెకు మిక్కుపవరుగు బేరమునిమిత్యమై వెళ్లెదగాక (అని వెళ్లును అంత విమలాదేవి వొక వ్యాఘ్రింబునుంగని)

వి-వ॥ అదో కొంత దూరమునుండి మహా భయంకరమగు వ్యాఘ్రింబు నాపైపుకే వచ్చుచున్నది యిక నేనేమిసేయుదును. (అని పరుగిడుచుండ రాంజెట్టివచ్చి).

రా-వ॥ యేమి నొక వ్యాఘ్రింబు స్త్రీని తరుముకొనిపోవుచున్నదే యిప్పుడే దానికడ్డము దిరిగి యాపులిని సంహరించెదగాక. (అని పులిని సంహరించి విమలాదేవినిగని) పాపము యీమె రాచకాంతవలె గనబడు చున్నది నిష్కారణముగా పులినోట బడుతుండెనుగదా.

వి-వ॥ హా దైవమా ఈపులినోటబడిన్నైన చావకుండ యితడెవరో కాని నన్ను కాపాడెను. సరేగాని మోసపుచ్చెడుగదా హా సర్వేశ్వరా యించుక మేలుజేసి వెంటనే కీడొనరింపు చుంటివా.

రాం - వి - వాదం దర్వు.

రాం॥ ఎవరునీవు యడవిలోయెం । దేగుచున్న దానవమ్మ । సవి నయముగ వినిపింపుము । నలతేరెద వెందుకమ్మ॥

వ॥ తల్లీ నీవెవ్వరు యీఘోరారణ్యంబున శోకార్తురాలవై యొంటరిగా చరించుచున్న వేమికారణమో తెల్పుము.

వి॥ యేమనివచియింతు నన్ను । యెందుకు గాపాడినావు । నామది కడు చింతదోచె । నీవెవ్వరో తెల్పిబోవు॥

వ॥ మహాత్మా యేనొక నిర్భాగ్యురాలను యీవ్యాఘ్రింబు నోట బడిన కష్టములుండకపోవునుగదా.

రాం॥ యెందుకునీవిటుల దుఃఖ । మొందెవు సవరింతునమ్మ । పొందుగ ధైర్యముగొనుమీ । వెందుకు భయపడెదవమ్మ.

వ॥ అమ్మా నీవిట్లేల దుఃఖించెదవు కష్టసుఖములు యెవరికైన గలిగేయుండును. మాఇంటికివచ్చిన సవరింతునురమ్ము.

వి॥ నామనోహరుని తనయుల । నెడబాసియు పుడమిలోన । క్షేమ మున్న నేమిఫలము । చెడ్డబ్రతుకు । బ్రతుకదగున॥

వ॥ అయ్యా నావారలనెల్లరను గోల్పోయి నేనుమాత్రం చెట్టువలె జీవించిన ప్రయోజనమేమి.

రాం॥ నీవిటువినుమిక భార్యలు । నిద్దరునాకున్నవారు । ధీవిలసిత ముగ చక్కని । తనయులు గలిగున్నవారు॥

వ॥ తల్లి నాకు యిద్దరుభార్యలు వారికి పుత్రులు మిగుల చక్కని వారు గలరు. కావున వారితోగూడ నీవు కాలముగడుపుచుందువురమ్మా.

వి॥ అయ్యా నీవటులననా । కియ్యెడ యెటుదోచదాయె। చయ్యన నరుదెంచనీదు । సతులేమనగలరో తెల్య॥

వ॥ కావున నీవుమాత్రము రమ్మంటివిగాని నీభార్యలిష్టపడుదురో లేదో యేల నీకీసంకటము.

రాం॥ మాతరోనాభార్యలునా । మాటను జవదాటలేరు । ఖ్యాతి మీర నిన్నె పెంపుజేతురు తప్పకనువారు॥

వ॥ తల్లి నాభార్యలట్టివారుగారు కావున నిన్నే పెంపుజేయుదురు నామాటనమ్మి రమ్ము పోవుదము.

వి। మంచిది అటులైతెనుయే । తెంచెద మీయాజ్ఞతోడ । యించుక తిప్పాయపల్లె । యీశుని మదినమ్మాయెడ॥

వ॥ వోదివ్యపురుషా నీవిట్లు నమ్మకముగా మాట్లాడుటవలన మీగృహంబునకు వచ్చెదగాని రెండోవిధంబు జూడవలదు తండ్రీ.

రాం-వ॥ హా తల్లీ యెంతమాటాడితివి యేను అటువంటివాడను గాను కావున సందేహించకుము.

పద్మాబాయి ప్రవేశం దర్వు.

నేపద్మాబాయినమ్మ । నాసరివారెవరెకొమ్మ । ఇమ్మపైగల రతి దేవిని । మించిన శృంగారినమ్మ ॥నే॥ ఖ్యాతిగ చాతుర్యముగల । సీతాంశుని ముఖినిసుమ్మ । ప్రీతితో రాంజెట్టికినే । పిన్నభార్యనౌదునమ్మ ॥నే॥ యీధరతిప్పాయపల్లె । యీశునిమది నెంతునమ్మ । బాధగలిగె నాసుతుపై । లేదు తండ్రిప్రేమనమ్మ ॥నే॥

వ॥ కావున నాసవతియగు సత్యాబాయికుమారుని అందమును గురించి నాభర్తకు నాపుత్రునియెడ ప్రేమలేకుండెను. నాసవతికొడుకు మేఘవాహానునికి విషమిచ్చిచంపిన పీడ వదిలిపోవును. అట్టిసమయము రాజూచెదగాక.

విమల మేఘవాహానుడను బాలుడు ప్రవేశం.

వి—వ॥ మేఘవాహనా యికనీవు చదువుకొన బడికి వెళ్లుగు లేకున్న పంతులు గొట్టగలడు.

ఇర్వురికి వాదం దర్వు.

మే॥ బాలుడ నాకట్టివిద్య । ప్రకటమవునదెట్లుతల్లి । వీలుగాని చదువుదాని । జోలిదీయబోకుతల్లి॥

వ॥ అమ్మా చదువుకుముదురు నాముకులేతయందురు కావున మిగుల పిన్నవాడనగు నాకావిద్య యెట్లు ప్రకటమవును.

వి॥ తనయా నీమృదువాక్కులు । విన సంతోషమునాయెను । వినుమిక పిన్నపుడుచదువు । విద్యయె జ్ఞాపకముండును॥

వ॥ అయ్యా బాల్యమందు చదివినవిద్యయే విద్య. యౌవనమున కష్టపడి నేర్చుకొననిది యదియెట్లువచ్చును.

మే॥ పద్యము రాకున్ననన్ను । పంతులు గొట్టునుగదమ్మ । వద్దిక నాకిపుడుచదువు । వలనుగాని కష్టమమ్మ॥

వ॥ కావున అమ్మా అన్నికష్టములకన్న విద్యనేర్చుకొనుట మహా కష్టముగదా తల్లీ.

వి॥ పంతులు నినుగొట్టకుండ । పాఠము జదివొప్పగించు । సంతసమున మెచ్చినీకు । పంతులె బహుమానమిచ్చు॥

వ॥ నీవు బుద్ధిగలిగి చదువుకొన్నయెడల పంతులెందుకుగొట్టును, నిన్నుగొట్టకుండ నేనావంతులుతో జెప్పెదను పదుము.

మే॥ తమ్ముడు రాకున్నబడికి । తప్పక పోగలనుచూడు । రమ్మన్నను వాడెన్నడు । రాడు మంచివాడుగాడు॥

వ॥ అమ్మా తమ్ముడైన వాయుబలుడు బడికియెంత రమ్మన్నా రాడు మరినేను మంచివాన్నిగాదానే.

వి॥ ముద్దులయ్య నీపలుకులు । ముచ్చటగాదోచెవిన్న । బుద్ధితో తిప్పాయపల్లె । పురుషోత్తముడేలునిన్ను॥

వ॥ ఆహా నాముద్దులయ్యా నీవే మంచివాడవు నాయిన్న. ( అని బాలుని యెత్తుకొని ముద్దుబెట్టుకొనునంత పద్మాబాయివచ్చి విమలంగని)

ప-వ॥ యేమే విమలా నీకుగూడ నాసవతివలెనే నాకుమారుడు పట్టిలేకపోయెనా. నీకు కూడుబెట్టునది యీలాటి పక్షపాతమునకేనా. (అనిన విమలాదేవి బాలునిదించి పద్యముతో).

వాదం – దర్వు.

వి॥ తల్లివినుమికా । నా । దగువాక్కులు చెవినొగ్గియు ॥త॥ కల్లగాదు నేనిర్వురి । పిల్లలదీసుక బడికిని । వెళ్లుచుండ నన్నువాదిలి । వచ్చెను నీసుతుడక్కడ ॥త॥

వ॥ తల్లీ నాకేలపక్షపాతము. అందరు సమానులేగదా. నీకుమారుడు బడికి రానితలంపుచే నీయొద్దకు నురికివచ్చెను విచారింపుమా.

ప॥ చాలుపోపోవే । నీ । లీలదెలిసెనే విమలా ॥చా॥ చాలునే నీసంభాషణ । సరిగ నీకునాదుసవతి । బాలునియందున్న ప్రేమ । పగిదిలేదు నాసుతుపై ॥చా॥

వ॥ విమలా దాసిదానవయ్యు మహారాజ్ఞితో సమానముజూడక వేరుజూచుట తగునా.

వి॥ జననిరోయేమీ । న । న్నసవలెనని యనుచుంటివ ॥జ॥ ఘనముగ నామర్యాదయు । గనుచుండియు నేడిదేమి । అనుమానము నాయందే । మగుపడె ద్రోహంబునీకు ॥జ॥

వ॥ అమ్మా యేనువచ్చి యిన్నిదినంబులాయెను నామర్యాద జూచుచుంటివిగదా నాయెడ నింతకోపమేల.

ప॥ యెందుకునీవూ । నా । ముందర యీవిధముబల్కు ॥ఎం॥ ముందటివలె లేవునీకు । మున్నటినుండేకండ్లకు । మందగించియుంటినుమే । మగుపడగలమెట్లు తెల్పు ॥యెం॥

వ॥ పాపమని కూడుబెట్టి సపరించినందులకు నీకింత గానరాకుంటిమా యికనిన్ను వెళ్లించేయుపాయంబూహించెద చూడుము.

వి॥ తగదటులనగా । ని । ర్దయనాయెడ దలచకమ్మ ॥ త ॥ పగయేమియు జేసితినా । పైనక్రోధమెందులకూ । వగవనాయె నామదికడు । వసుధలో గతిలేనిదాన్ని ॥త॥

వ॥ తల్లీ దైవముసాక్షిసుమా నీయందెంతమాత్రము నాకు రెండోతీరులేదు జననీ నన్ను కరుణింపవలయును.

వ॥ తగదనియేమో । నా । తలబగులగ వదురుకుంటు ॥త॥ బుగులు లేక నాతోనీవు । ప్రేలిన తిప్పాయపల్లె । ఖగరాడ్వాహను బెట్టుల । గని మెచ్చునె తొలగుముఛీ ॥త॥

వ॥ యేమిరా యింక వాదించుచునేయుంటివా వెళ్లుము. (అని వెళ్లించి పద్మాబాయి తనలో) పాపము దీనియందెంతమాత్రము రెండో తీరులేదు. నిష్కారణముగా మాటలంటిని యేవిధంగనైన యీపోరన్ని మాయముచేయునిది నాభర్తకు నాకుమారునియందనురాగము జనింపదు నిన్ననే విషమును సంపాదించితినిగాని సమయముగానున్నది యింక జూచెదగాక.

వ॥ (అంత మేఘవాహనుడు విమలంగని) అమ్మా నాకు ఆకలియగు చున్నది నేబోయెదను (అనిన పద్మాబాయి విని తనలో).

వ॥ వెదకబోయిన తీగె కాలుకు జుట్టుకున్నదన్నట్లు నీనికిప్పుడే యాకలియగుచుండెను. సమయము మంచిగ దొరలివచ్చినది యిప్పుడే నీనిం దీసుకొనిపోయి విషాన్నము దినిపించెదగాక (అని విమలంగని)

వ॥ విమలా బాలునికి ఆకలియగుచున్నదట నేదినిపించ కొనివచ్చెద నీవిచ్చటనే యుండుము. (అని బాలుని తీసుకొనిపోయిన) (విమలాదేవి తనలో)

వి-వ॥ యేమిరా యింతకుమున్నా బాలునియందు నిర్దయగలదిగ్గామై యెన్నడులేనిది నేడేమొ అనురాగంబున తినిపించెదనని తీసుకపోవుచున్నది కారణమేమో తెలియదు.

(అంత పద్మాబాయి విషాన్నము దినిపించుకవచ్చి విమలకొప్పగించి)

వ॥ విమలా యికనీబాలుని యెత్తుకొనిపోయి బడిలో పంతులు కొప్పగించిరమ్ము వేగంబునబొమ్ము (అనివెళ్ళిన విమలాదేవి బాలున్ని తొడపై గూర్చుండబెట్టుకొని).

వాదం దర్వు.

వి॥ తనయా భోజనముజేసి । తక్షణమేవస్తివిరా । ఘనమిా పిన్నమ్మప్రేమ । గలదై యేమొనగనురా॥

వ॥ తండ్రీ కడిచివచ్చితివా మరిమిాపిన్నమ్మ యేమిదినిపించెనో తెల్పుము.

మే॥ వినవేజననిరోసీకా । విధి నేవినిపించెదనూ । తినుమని అన్నము పాలిడి । తనేకలిపియు తినిపించెను॥

వ॥ అమ్మా మాపిన్నమ్మ అన్నములో పాలుబోసి తినిపించినది. యింక నీవు యెందుకుదినలేదు. మాయమ్మ నీకు బువ్వ నేబెట్టలేదా.

వి॥ కడుమోదము నీవాక్కులు । కర్ణానందంబాయెను । గుడుచుట వలదిపుడు నిన్ను । బడికిదోలి రావలెనిను॥

వ॥ మేఘవాహనా నేనిప్పుడు భుజించుటవలదు నీవు బడికేగినపిదప భుజింతునుగాని పదుము.

మే॥ అమ్మా నీమాటులనుటకు । ఆకలెలేదా నీకు । పోమ్మా భుజియించిపిదప । బోవచ్చును బడివేళ్ళకు॥

వ॥ అమ్మా బడికెల్లుదాముగాని నీవైతే భుజించిరాపోమ్మా.

వి॥ ఆకలి నాకొటలేదు । వోకుమార నిజమునమ్మ । నీకడుపులో నాపైదయ । నిజముగగలదా తెల్పుము॥

వ॥ నాయనా నీకు నాపైదయయున్నదా తెల్పుము నిన్నుజూడ నాకు కడు సంతోషముగానున్నది.

మే॥ ఘనముగ తిపాయపల్లె । వనజాక్షుడు కరుణించును । మన మీయెడ ముదమునకడు । మిక్కిలిభక్తిన యెంచిన॥

వ॥ కావున నీకు నాయందు దయయున్నదాయని యడుగుచున్న వైతే నీవద్దనున్న మాయమ్మ జ్ఞాపకానికే రాకుండెనుగదా తల్లీ.

వి-వ॥ అకటా యీముద్దుబాలుని మాటలువిన్న నాకనకసేనుడు జ్ఞాపకమునకొచ్చుచుండెను. హా కొడుకా యికనేనెట్లు భరించి బ్రతికి యుందురా తండ్రీ.

మే-వ॥ అమ్మా నాకేమోకాని కన్నులుదిరుగుచు కడుపులోమండుచు దేహము పరవశమగుచున్నది. యికనే బ్రతికేవుపమగుపడుటలేదు తల్లీ (అని మూర్ఛిల్లును).

వి-వ॥ ఆహా మేఘవాహనా యేల నీవు మూర్ఛనొందితివి నీతల్లిదండ్రులకు నేనేమనివచింతును వాడునన్ను సైపగలరా హా శ్రీహరీ యిక నాకేది దారి.

వి-గీ॥ పుడమిలో యేనుపడరాని యిడుములబడి । యిపుడు వీరింట నుండగా నిట్లుజేయ । బూనినావొకో నామీదబుద్ధితోడ । తనివిదీరలేదా యింక వనజనయనా॥

వ॥ హా దైవమా నేనేమిసేయుదు వీని తల్లిదండ్రులువచ్చి పిల్లన్ని యేలజంపితివని నన్నెంత దండింతురో కదా యికనాకు నీవేదిక్కు తండ్రీ.

(అంత రాంజెట్టివచ్చి)

రాం-వ॥ యెవ్వరిట దుఃఖమొందుచున్నారు (అని పొలుసజూచి) హా పుత్రా యేల నిట్లు బడియున్నాడవు (అని విమలంగని) విమలా నాకు మారుడెందుకిట్లు స్మారకముదప్పి పడియున్నాడు.

వి-వ॥ అయ్యా యున్నవాడున్నట్టులే కండ్లు దిరుగుచున్నవని కడుపులో ... చున్నదని భూమిపై బడెను తండ్రీ,

(రాంజెట్టి దుఃఖముతో) దర్వు.

అయ్యో నాముద్దులతనయా । యిటులౌటదెట్లు । నయ్యానీ దోకారణమరయా । యిట్లేడనీవిట్లుజేయు । యికమాకాధార మేది । చయ్యన మాకూతలువిని । సరగునలేవరతండ్రి ॥ అ ॥ కేవలముగనుండక నీకా । యిలయందు బ్రహ్మ । దేవుఘటన దెలిదుబాయెగా । యేవిధైననిన్ను విడిచి । యొక్కఘడియ తాళలేము । కావున కూర్చుండులేచి । కలిసి భుజింతుమురతండ్రి ॥అ॥ యీధర తిప్పాయపల్లెలో । నివసించునట్టి । మాధవు మధుసూదనులీలలో । కాదనందునెట్లుసగాక్య । కాంతిమించి యుంటివీవు । వావిరిగనునిన్నుయిట్లు । వోర్వలేక జేసెనందు ॥అ॥

వ॥ తనయా నీవిట్లగుటకు కారణ మేమిగాపచ్చును. (అంత సత్యాబాయి అరుదెంచి).

స-వ॥ నాథా నీవేల దుఃఖించుచున్నాడవు (అని పొలుసిజూచి).

దర్వు॥ కొడుకా నీకేమాయెను । కనుత్రిర నాతోనుడువర । పడిపడకను యెవడైనిందూ । నాకొడుక కొడుక । పడజేసెనపాపిష్టమనందూ॥ పాపిబ్రహ్మదేవుడింత । పాపమనక సృష్టెసను । యీపగిదియుజేసెనో తెలియా ॥ నాకొడుక కొడుక । వోపికుసియ నిలువలేనురా ॥ పున్నమ చంద్రున్నిబోలి । యున్నది నీముఖముజూడ । క్రన్నన యిటులౌటదెలియరా । నాకొడుక కొడుక । కండ్లుదెరచి నన్నుజూడరా ॥ యించుక

తిప్పాయపల్లె । యీనుసికరిణ నీపై । యుంచిన ధనములను దొలగవా। నాకొడుక కొడుక । మంచినీరు యిదిగో త్రాగవా ॥కొ॥

వ॥ నాయినా యిప్పుడే నావద్దనుండి వచ్చితివిగదరా తండ్రి నీకింతలోనే యెంతకర్మము ఘటించెను.

(అంత పద్మాబాయి కౌటిల్యంబున బాలునిపైబడి).

దరువు॥ ముద్దులతినయా । సీ । మాయవాకు దెలియదాయె । నిద్దుర గానియుంటివనీ । యెంతమేము జేరిపిలువ । పద్దా నీవు పద్దా లేవాయెద్దా మేల్కొనుము తండ్రి ॥ ము ॥ యింతవాత్రమున నీకు । యెంతమొన రించిరో కా । యింతా బలుచింతా నీకెంతాగతివచ్చె తండ్రి ॥ము॥ హాసిగ తిప్పాయపల్లె । శ్రీశునికృపయెటులో కాని । దాసీ మిమురోసీ యిటుజేసీ యుండెనుర కొడుక ॥ము॥

వ॥ అయ్యో కొడుకా నీకెంతగతివచ్చెరా తండ్రి (భర్తతో) నాథా యిందుకు మూలకారణం యీదాసియే. యెట్లనిన యింతకుముందు బాలుడు ఆకలియగుచున్నదన లోనికి దీసుక వెళ్లి పాలన్నములో నేమియో కలిపి తినిపించుచుండెను. అపుడు నేనిట్లని గుర్తించలేదు. యిది నాకుమారునిగూడ చంపెదే. యేభగవంతుడో అడ్డపడ్డట్టున్నది. హా కుమారా మేఘవాహనా,

రాం-వ॥ యేమేవినులా పిల్లన్నిజంపి యేమెరుంగనని పల్కుచుం టివా. ఛీ మూష్టురాల నిన్ను వ్యాఘ్రిబారినుండి తప్పించుకొని తెచ్చినం దులకు నాకుమారునకు మృత్యుదేవతవైతివా.

(అని దుఃఖించుచుండ రాజభటులువచ్చి)

బహ్రాక్-వ॥ రాంజెట్టిగారూ మీకుమారుండేవిధంబున చనిపోయి నాడు.

రాం-వ॥ అయ్యో యేమనితెల్పుదు యిదో. మాఇంటనుండుయీ దాసిముండ మందుబెట్టిచంపినది దేవా.

బహ్రాక్-వ॥ అటులైన యీమెకు ప్రాయశ్చిత్తమగును. మీరు న్యాయస్థానమునకు పొండు. యీబాలుని మృతకళేబరమును వైద్యశాలకు బంపింతుము.

(కనకసేనుడు కీర్తివంతునితో వాదం దర్వు)

కన॥ వోయి సుకీర్తి । విను । మీయజమాని జయసింహు ॥వో॥ యీయెడ రాజ్యంబునేడి।పోయి నింతవరకును రా।డాయెను పురజనులేయ। న్యాయము లేకున్న వార ॥ వో ॥

వ॥ సుకీర్తి జయసింహుడింతవరకైన రాకుండెను. పురజనులు సుఖంబున నున్న వార లేకదా.

సు॥ గరిమెతోయికనూ । వ । కనకసేన భూపాలా ॥గ॥ మరిజయ సింహుడు క్రూరుని । బదిమూర్ఖకరానేరడు । అరమరేల నగరవిషయ । మెరుగనైతి వచియింపగ ॥గ॥

వ॥ కనకసేనభూపాలా యేల నింత త్వరపడుచుంటివి. అదుగో పుజారు వచ్చుచున్నాడు పట్టణ సమాచారంబడిగి తెల్సుకొమ్ము. (అంతలో పుజారువచ్చి).

పు-వ॥ రాజేంద్రా మీకిదో పదివేల వందనంబులు.

కన-వ॥ వర్ధిల్లుముగాని యీనగర సమాచారంబులెట్టివో తెల్పుము.

పు-దర్వు॥ వో మహరాజా । గ్రామముసంగతి । యేమని తెల్పుదు। యీరాంజెట్టికి । భామినులిద్దరు । బాగుగనుండగ । రామరామవోక । రమణినిఇంట । దాసిగనుంచుక । తల్లిసమానము । జూచుచుండయీ । మోసకారితన । జ్యేష్ఠబార్యప్రియ । సూనునికినివిష । మీసమయముయే దోషమననకను । పాలలోగలిపియు । పాపిముండయా । బాలునికినిదిని । పించినవెంటనె । కీలుబొమ్మవలె । బాలుడుధరపై । గూలెనంచు । వక్కాణించిననే । వారిదిద్దోక్కాని । వచ్చిమీతోయా । వార్తదెలిపితిని । వరుసగవినుడీ । భూరిగధర తిప్పాయపల్లెహరి । కారుణ్యంబున । వారల గాంచుడి ॥ రామారామా । రఘుకులసోమా । ఆహారామా అయోధ్య రామా । జయజయరామా జానకిరామా॥

వ॥ సునామహరాజ్.

కన-వ॥ వింటివే సుకీర్తి.

కన॥ యెంతపాపమూ । ఇవు । డేలరి యూర్చుండువార ॥యెం॥ క్రాంతమాత్రిమానవెయిట్టి । ఘోరకృత్యములు జరిగిన । వింతగాదెచూడ న్యాయ । వాదుల రప్పించుమింక ॥యెం॥

వ॥ సుకీర్తి యిపుడే యాన్యాయవాదులరప్పించి విచారించి శిక్ష యివ్వవలయును.

సు॥ మంచిదియటులే । రా । వించెద నాలస్యమేల ॥మం॥ అంచిత ముగ దేవదత్తు । డాసుందరునునిబిలిచిన । కొంచమాత్రమున తీర్మా । నించగలరు తొందరేల ॥వ॥

వ॥ రాజేంద్రా మీరనువిధంబున నే న్యాయవాదుల రప్పించెదను.

కన॥ పిలువు వేగమూ । యా । వలిసంగతి వాదులనిటు ॥పి॥ చలమ దేలజేసెవు యిక । సరగున యీసభకువార్ని । బలుక వేల రాంజెట్టి । భార్యలయుక్తము దాసిని ॥పి॥

వ॥ కావున రాంజెట్టి వర్గ రాలను యీసభకు రప్పించుము.

సు॥ త్వరపడు టేలా । ఖుం । దరుదెంచినవారదో గను ॥త్వ॥ కర మొప్పగ వారినిపుడు । ఖండితవచనములనడిగి । సరగున తిప్పాయుపల్లె । హరికృప శిక్షించిపంపు ॥త్వ॥

వ॥ మహాప్రభో వారదొకనుము.

(అంత న్యాయవాదులరుదెంచి)

న్యా-వ॥ రాజచంద్రా నమస్కారములు.

కన-వ॥ న్యాయవాదులారా వర్ధిల్లుడు యీరాంజెట్టి న్యాయము పరీక్షించుడు.

దే-వ॥ చిత్తము రాజన్.

కన-వ॥ సుకీర్తి ప్రథమము రాంజెట్టి యభిప్రాయముడుగుము.

సు-వ॥ వుజూర్ యీరాంజెట్టిని బిల్వుము.

వు-వ॥ అచ్చా బులాయింగె (అని పిలుచును) రాంజెట్టి హాజరుహై.

రాం-వ॥ సర్కార్ హాజరువున్నాను.

సు-వ॥ రాంజెట్టీ నీకుమారుడేటుల మృతినొందెను.

రాం-వ॥ అయ్యా మాఇంటనుండు దాసి విషమిచ్చి చంపినది.

సు-వ॥ అది నీకెట్లుగుర్తు సాక్షులున్నారా.

రాం-వ॥ లేకేమి యిందుకు నాచిన్నభార్యయే సాక్షి.

సు-వ॥ నీవాదాసినెక్కడ గొనితెచ్చితివి,

రాం-వ॥ నేనొకదినంబున వర్తకమునిమిత్యమై వెళ్ళుచుండ అరణ్య

మున దిక్కుమాలి యేడ్చుచుండ మాఇంటికి తీసుకొనివచ్చి దాసిగా నుంచుకొని తల్లిసమానము జూచుచుంటిని.

సు—వ॥ ఆదాసి నిజనివాసము నీకు దెల్యునా.

రాం—వ॥ తెల్యాదు అడిగినప్పుడెల్ల దుఃఖించును.

సు—వ॥ అటుల చెప్పకపోవుటనుంచి నీకు సందేహామొదవ లేదెందుకని.

రాం—వ॥ యీామె నడువడినిబట్టి మహాపతివ్రతయని తల్లివలె భావించుచుంటిని.

సు—వ॥ ఆమెకేమిపని యేర్పాటుజేసితివి.

రాం—వ॥ నాకుమారులను బడికి తీసుకపోవుట గొనివచ్చుటకేర్పాటుజేసితిని.

సు—వ॥ అట్టిమనిషి విషమెట్లు సంపాదించినది తెల్యునా.

రాం—వ॥ తరుచుగా రోగిష్టులకు చికిత్స చేయుచుండుటచేత విశ్వాసముంచితిని.

సు—వ॥ నీపెద్దభార్య నామంబేమి.

రాం—వ॥ సత్యాబాయి.

సు—వ॥ మంచిది ఆమె వాంగ్మూలముగూడ వినవలయును. వుజూర్ సత్యాబాయిని బిల్వుము:

వు—వ॥ సత్యాబాయి హాజరుహై.

(అంత సత్యాబాయివచ్చి నిల్చిన)

సు—వ॥ అమ్మా నీపుత్రునకు విషమెవ్వరుబెట్టిరి.

స—వ॥ నాకెవ్వరియందనుమానములేదు. యికనన్ను నడుగకుడు.

సు—వ॥ యికనీవుబొమ్ము వుజూరు రాంజెట్టి చిన్నభార్యనుబిల్వుము.

వు—వ॥ పద్మాబాయి హాజరుహై (పద్మాబాయివచ్చి చేరిన)

సు—వ॥ అమ్మా నీసవతికుమారుడెటుల మరణించెను తెల్పుదువా.

స—వ॥ తెల్పకేమి మాఇంటనుండు దాసి విషమిచ్చి చంపినది.

సు—వ॥ ఆమె విషముపెట్టినది నీకెట్లు దెల్యును.

ప—వ॥ పిల్లవానికి అన్నము తినిపించగ చూచితిని. పిదప అరఘడియలోనే బాలుడు నురుగులుగ్రక్కుచు మరణించెను.

సు-వ॥ ఆదినమున నీపుత్రునకు ముందుగా దినిపించితివా నీసవతి పుత్రునకా,

ప-వ॥ నాసవతిపుత్రునకే ముందుగా దినిపించితిని ఆ లేమలేదు.

సు-వ॥ పద్మాబాయి యిద్దరిబాలురకొకసారి తినిపించని కారణ మేమి,

ప-వ॥ నాపుత్రుడు ఇంటియందులేనందున ఒక్కనికే తినిపించితిని.

కన-వ॥ ఓహో యీమెయింక తొందరపడుచునేయున్నది ప్రశ్నజాలించుడు.

సు-వ॥ చాలుచాలు పద్మాబాయి యికనీవుబొమ్ము.

సు-వ॥ వుజూర్ రాంజెట్టిదాసిని బిల్వుము.

వు-వ॥ రాంజెట్టి దాసి హాజరుహై.

(అంత విమలాదేవి వచ్చినిల్చిన)

సు-వ॥ అమ్మా ఆబాలునికి విషముబెట్టినది నీకుదెల్యునా.

వి-వ॥ నాకుదెల్యాదు.

సు-వ॥ నీవే విషముబెట్టి చంపితివని యీనెపము నీయందే నిల్చియున్నది యిందుకు నీవేమందువు.

వి-వ॥ నేనుబెట్టలేదు యేదియు నాకుదెలియదు.

సు-వ॥ ఆదినము సత్యాబాయికుమారున కెవరుదినిపించిరి.

వి-వ॥ పద్మాబాయి తినిపించియున్నది.

కన-వ॥ మంచిది సుకీర్తి నీవట్లుండుము. యిక న్యాయమును పరిశీలించండి.

దే-వ॥ ఈన్యాయము వారి వాంగ్మూలముబట్టి విచారించితె పద్మాబాయిదేనేరమని తోచబడుచున్నది.

సుం-వ॥ అట్లెట్లు ముఖ్యవిషయము దాసియే నేరస్తురాలు.

కన-వ॥ ఔను యీసుందరుడన్నమాట నిజముగాను యీదాసిని యెవరిదినేరమో అడిగి తెల్సుకొనవలయును.

కన-వ॥ (విమలతో) అమ్మాయీ నేరము పద్మాబాయిదే యనుకొవలయునా

వి-వ॥ మహానుభావా అదినేజెప్పజాలను,

కన-వ॥ అదట్లుండనిమ్ముగాని ముందు నీపేరు తెల్పుము.

వి-వ॥ అది మీరడుగకుడు,

కన-వ॥ అటుల జెప్పనియెడల తప్పు లెక్కింపబడును.

వి-వ॥ తప్పున్న యెడల దండింపుడు.

కన-వ॥ శిక్ష అతి కఠినమైనదిగదా.

వి-వ॥ కఠినమైన తమకేదుదెవ్వరు (అని కనకసేనుని బాగాపీక్షించి) యీతనిమాటలు వినగా నాముద్దుల కనకసేనునివలెనే తోచుచున్నవే అకటా యెక్కడి కనకసేనుడు.

(అంత వైద్యుడు మేఘవాహానుని దోడ్కొనివచ్చిన కనకసేనుడు గని వైద్యునితో),

కన-వ॥ వైద్యుడా యీకురవ్రాడెవడు.

వై-వ॥ విషముచే జచ్చిన రాంజెట్టి పెద్దభార్య కుమారుడు.

కన-వ॥ యిదియేమిచిత్రము విషమువలన నిర్జీవితుండైన బాలుండు మరల యెట్లు జీవించెను.

వై-వ॥ అయ్యా మేము అనేక ప్రయాసలకోర్చియొక ప్రభావంతంబున బ్రతికించితిమి.

కన-వ॥ అదెట్టి ప్రభావమైన మృతినొందినవారు జీవించుట అసంభవమేకదా.

వై-వ॥ ఓహూ రాజేంద్రా ఆయుర్వేదమననేమిటో మీకు అర్ధమూగావడమేలేదు. ముఖ్యమైన సంజీవియే ఆయుర్వేదమనబడును. కాబట్టి యెంతదండి రుగ్మతలనైన పారదోలి బ్రతికించవచ్చును.

కన-వ॥ యింతవరకు మనముజేసినదంత నిష్ప్రయోజనమే యిక బాలుని అడిగిన సర్వము తేటపడగలదు ప్రశ్నించుడు.

సు-వ॥ అబ్బాయీ నేటిదినము యీదాసి నీకు యేమిదినిపించినది.

మే-వ॥ పాపము యీనాడు యీమె దినిపించనేలేదు. మాపిన తల్లియే పాలన్నములో నేమియోకలిపి తినిపించినది. (అప్పుడందరు పద్మా బాయి ముఖంబుచూచుచు చప్పట్లువేయుదురు అంత కనకసేనుడు).

కన-వ॥ సుకీర్తి వింటివా సర్వంబు తేటపడినదిగదా. యిక నీవీ

తీర్మానము సభవారందరికి వినిపించి పద్మాబాయిని శిక్షించుటకై భటుల కాజ్ఞాపింపుము.

సు-వ॥ అయ్యలారా యీపద్మాబాయి మేఘవాహానునకు విషంబు బెట్టి దాసిమీద నేరారోపణము జేసినది. దైవకృపవలన బాలుడు బ్రతికి వచ్చినిజంబుగా నిలచియున్నాడు వింటిరా.

సు-వ॥ వుజూర్ చూచెదవేమి యీపద్మాబాయిని శిక్షించి చెర సాలయందు యుంచుడు.

వు-వ॥ చల్ చల్ తేరా బద్మామిమారుం నడువు. (అని పద్మాబాయిని గొనిపోదురు అంత కనకసేనుడు విమలంగని తనలో)

కన-వ॥ యీామె దాసిదానివలె దోచబడుతులేదు మాతల్లియే మోానని ఆశ బొడుముచున్నది. అక్కటా యెక్కడిమాతల్లి మున్నే సముద్రమునకు బడెనుగదా యొకవేళ బడకపోయినను కౄరుడు బ్రతుక నిచ్చునా. (యని ప్రకాశముగా) అమ్మా నీవారాంజెట్టికి సరణ్యమున గనబడుటకేమికారణమో తెల్పుము.

వి-వ॥ దిక్కులేనిదాన నగుటవలన.

కన-వ॥ ఐతె నీవెవ్వరో నాకుదెల్పుము నాకు సాధ్యమైనంతవరకు సహాయము జేసెదను.

వి-వ॥ చావసిద్ధముగానున్న నాకేమి సహాయము గావలయును.

కన-వ॥ అమ్మా యీరాజసభయందు అట్లు బలుకరాదు నిజము వచింపుము.

వి-వ॥ (తనలో) యేమీా యీరాజపుత్రుని వాక్యంబులు వినగా కనకసేనుని వల్కులవలె యున్నవే. ఐన నావృత్తాంతము దెల్పిన సర్వము తేటపడగలదుగదా (యని ప్రకాశముగా) తండ్రీ యేను క్షత్రియ సంజాతురాలనే మదీయ మనోహరుని కౄరసేనుడను నామరిది సంహారించి నాపుత్రీపుత్రుని అరణ్యముపాలుజేసి నన్ను అనేకబాధలుపెట్టిన యెట్టకేల కెట్టులనో తప్పించుకొని యీరాంజెట్టికగుపడ తనఇంటికి తీసుకొనివచ్చి యింతపర్యంతరం కన్నతల్లివలె భావించి పోషించెను. (అనిన కనకసేనుడు)

కన-వ॥ హాతల్లీ నీకెంతదుర్దశ సంప్రాప్తమైనది.

వి-వ॥ హా కుమారా కనకసేనా జీవించియున్నావా తండ్రీ (అని ముద్దుబెట్టుకొనును).

(తల్లి కొడుకులకు వాదం దర్వు)

కన॥ అమ్మా నీ వెంతెంతా। ఆయాసాపడితీవో। మమ్మా బాసియు నెట్లు। మహిలోనా బ్రతికితివో॥

వ॥ అమ్మా నీవింకెంతెంతకష్టముల బడితివో కదా.

వి॥ తనయా నాశ్రమలేమని । తగనీతో వచింతునురా । నను బోలిన దుర్భాగ్యుల । నవనిలోగనియెరుగనురా॥

వ॥ కుమారా నాకష్టముల కంతమే లేదు యాశ్వారునిబాధకు నోర్వక సముద్రమున బడితినితండ్రీ.

కన॥ అకలంకామైనట్టి । అంబుధినర్ణ బడి వెనుకా । ప్రకటితముగ జీవంబుల । బాయక నేమైతివోకా॥

వ॥ అమ్మా నీవాసముద్రమున బడినసిదప యెట్లు బ్రతికితివితల్లీ.

వి॥ తక్షణమే బెస్తోడా । తావున వలవేయగను । అక్షయముగ వలనుజిక్కి । అటకడ తేరితి నేను॥

వ॥ నాయనా సముద్రమునుండి బెస్తవాడు వలవేసి పైకిదీసి ఇంటికి దోడ్కొనిపోయి శ్రమపెట్ట యెట్టకేలకెట్టులనో తప్పించుకొని అరణ్యము జేరితిని. కుమారా తారయేది.

కన॥ మాకష్టంబులు నీకు। మరియేమని తెల్పుదునూ। గాకతీరునే పూర్వా। కర్మానుభవములునూ॥

వ॥ అమ్మా భటులు మాయెడ కరుణగలవారై అరణ్యమున విడిచిపోయిరి. పిమ్మట భగిని దాహపీడితయై మూర్ఛిల్లెను. యేను జలంబులకై వెళ్ళి వచ్చిచూడ భగిని గానంబడకుండిన వెదకుచురాగా యీపట్టణంబు లభించెను. అక్కడ యెక్కడున్నదెరుగను తల్లీ.

వి-వ॥ హా తారా యెందుబోయితివి నిన్ను యేమృగము భక్షించెనో కదా.

వి॥ ధరయందూ వెలసీనా । తిప్పాయాపల్లీశు । కరుణదోచదా యెను యిల । తారనుబ్రోచునో శ్రీశు॥

వ॥ కుమారా నిన్నుగని కొంతధైర్యము నొందితినిగాని యిక తార నెట్లుగాంచనౌను తండ్రీ.

కన-వ॥ తల్లీ దుఃఖించకుము యేనిప్పుడె నలుదిశలకు భటులను వెతకబంపెద నీవు స్నానముజేసి భుజించుము పొమ్ము.

(కనకసేనుడు సుకీర్తినిగని)

కన-వ॥ సుకీర్తీ నాభగిని తారను వెదక నలుదిక్కులకు భటుల నంపుము.

సు-వ॥ రాజేంద్రా అటులే యొనర్చెదను (అని నిష్క్రమింతురు).

తారా జయసింహులు రాకడ.

తా-వ॥ మహాశయా యింక మన మెంతదూర మేగవలయును.

జ-వ॥ పుత్రీ చెంతకేవచ్చితిమి శ్రమయనక కాలుసాగింపుము. (అంతలో సేవకుడువచ్చి).

వాదం - దర్వు.

సే॥ వందనములు రాజచంద్ర । వర సద్గుణసాంద్ర మీకు । పొందుగపదివేలు జేతు । పోదము రావయ్యపురికి॥

వ॥ మహీపాలా మీరిన్నిదినంబులనుండి రానికారణంబేమి స్వామి.

జ॥ క్షేమము మనరాజ్యంబున । యేమికొరత లేకజనులు । నామది కడు విసుగుదోచె । నరుదెంచితి వెందుకొ బలు॥

వ॥ సేవకా వర్ధిల్లుము మనరాజ్యంబున క్షేమమేనా.

సే॥ యుర్వికాంతుడయ్యెనట్టి । యుదయసేన సుతుడువినుము । నిర్వికార కనకసేను । డరుదెంచెను మనదుపురము॥

వ॥ రాజేంద్రా కనకసేనుడు మనపట్టణంబుజేరి మీకొరకెదిరి చూచుచుండెను దేవా. (రాజు తారతో)

జ॥ తార కనకసేనుడుమా । పురముజేరియున్నాడట । రారమ్మిక మనదుకొరకు । రంజిల్లుచునున్నాడట॥

వ॥ ఆహా బాలికా మీకనకసేనుడు మనకొరకు యెదిరిచూచు చున్నాడట త్వరగా బోదామునడువు.

తా-వ॥ యేమీ నాసోదరుడు మీపురంబులో నున్నాడ ఆహా నాభాగ్యము నేటికి ఫలించెనుగదా.

సే॥ తల్లి విమము కనకసేను । దుల్లమందు తొందరొందె ! తల్లి విమలదేవినీగని । తారతార యనుచుగుంచె॥

వ॥ అమ్మా నీకొరకై నీతమ్ముడఘోరించుచున్నవాడు. మీతల్లి విమలాదేవిగూడ జేరియున్నది తల్లీ.

తా॥ సేవక మాతల్లినందు । జూచితివా తెల్పువేగ । భావమందు గలిగియున్న । దావంతను లన్ని గొలగ॥

వ॥ సేవకా మాతల్లిగూడ వచ్చినదా ఆహా నేటికి మాకష్టములు గొలంగెను.

జ॥ పోదమురాండింక తడయు । రాదు మనము నెల్లవలయు । యీధర తిప్పాయపల్లె । యీశునిమది నెంచవలయు॥

వ॥ కావున యింక మనమిచటుండతగదు పోదాము రండు (అని పోదురు)

కన-వ॥ సుకీర్తి తారకైతోలించిన భటులింతవరకైన రాకున్నరుగదా.

సు-వ॥ రాజకుమారా మీరనుచున్నంతలోనె వచ్చుచున్నవారదో కనుడు. (అంత జయసింహుడు తారయుంజేరి తార తల్లిపైబడి దుఃఖించును జయసింహుడు కనకసేను నలుముకొని).

నాదం - దర్వు.

జ॥ కనకసేన నేటికిమీ । కష్టంబులు దొలిగేనా । అనఘమిమ్ము గాంచిగినా । కతి ముదమా యింతలోన॥

వ॥ హా కనకసేనా మీరెంతకష్టముల పాలైతిరి.

కన॥ అనుభవములు యెవరికైన। సలవియె తప్పించుకొనగ । వనజగర్భుడిట్లనిమా । వంతునవ్రాసుండ బహుగ॥

వ॥ జయసింహభూపాలా గడిచినదానికై చింతించిన నేమిలాభము నేటికి జయమయ్యెను యిదంత మీఆశీర్వాదంబే కదా.

విమలాదేవి తారతో నాదం - దర్వు.

వి - దర్వు॥ పుత్రికనీవిలను మమ్మ । బాసి శ్రమలబడితివేమొ । ధాత్రిలో నీపాలబ్రహ్మ । దేవుడిటుల వ్రాసెనేమొ॥

వ॥ బిడ్డా మనమెల్ల కష్టములబాసి యుంటిమిగాని సర్వేశ్వరుండు మేలొనంగునో లేదోకదా.

తా॥ అమ్మరో కొగలకార్యము । లయితీరెను అనుభవములు । యిమ్మహియం దేమియున్న । దమ్మ యింతకన్నునుబలు॥

వ॥ కావున నేటికి కష్టాలు వదలినవిగదా యిక నీమది చింతించకుము తల్లీ.

(కనకసేనుడు తారతో)

కన॥ అక్కరో నిన్నరణ్యమున । నొక్కదాని నుంచిపోయి । యెక్కడ జలముల గానక । చిక్కులబడితినిగదాయి॥

వ॥ భగినీ నిన్నెడబాసి సేనీపురంబు జేరితినిగాని నీవీజయసింహుని కట్లగుపడితివి.

తా॥ తమ్మీ నీవేగినంత । తస్కరుండువచ్చి నన్ను । యమ్మహాకాళమ్మకు బలి । యివ్వదలచి గొనిపోయెను.

వ॥ అట్టి తరుణమున యీజయసింహుడు యాచోరున్ని సంహరించి నన్ను గొని తెచ్చెను తమ్ముడా.

కన॥ భూమిపాల నీవలనా। మేమిల దరిజేరినాము। క్షేమతో మాతండ్రివిధము। ప్రీతిజూస్తి వెంతోఘనము॥

వ॥ మహాత్మా మీకు ప్రత్యుపకార మేమి చేయగలము. గాన మాతండ్రివంటివాడవని యెల్లకాలము దలుతుము.

జ॥ ధారుణి తిప్పాయపల్లె। ధామునిసరిదైవమేడి। మారజనకుడేలెకృపతో। మేలుగలిగె తెల్పదేది॥

వ॥ కావున మనకందరకు యాపరంధాముడే తండ్రిగదా పరి సేటికి మాయనుగ్యోను గాని యాక్రూరసేనుని బరిమార్చి లోకబాధ మాన్పవలయును పదుడు.

కన - వ॥ మంచిది మాతల్లిని భగినిని దోడ్కొని సైన్యంబుతో నేగవలయునుగదా.

జ - వ॥ సైన్యంబు సిద్ధపరచినారము యీరథంబున గూర్చుండుడు యేను రథము దోలువాడ (అనివెళ్ళి రణభేరి మ్రోగించినంత క్రూరసేనుడు)

వీరశూరులతో వాదం పర్వు.

క్రూ॥ వీరశూర రణభేరీ। వాద్యము వినబడుచుండెను। సరగున మనపైకెవడో। శత్రువొచ్చెనని తోచెను॥

వ॥ శూరా మనపైకి శత్రులు దండెత్తి వచ్చుచున్నట్లున్నది.

శూ॥ అవుదొర మీకనకసేను। దరుదెంచునటని తెల్సెను। సవినయముగ జయసింహుని। సాయముతో వచ్చెనుగను॥

వ॥ అయ్యా మీకనకసేనుడు జయసింహుని సహాయమొనర్చుకొని వచ్చెననవిందును.

క్రూ॥ యెక్కడి యాకనకసేను। డిక్కడి కరుదెంచుటకు। గ్రక్కున మీకిచ్చియుంటి। కాననమున ద్రుంచుటకు॥

వ॥ అట్టిబాలుగ మీరు అరణ్యమున ఖండించియుందురుగదా.

శూ॥ సత్యమె యిర్వురితలలను। చక్కన ఖండించిరాను। తత్సమయము వారియొద్ద। తపోధనుడు జేరెనువిను॥

వ॥ రాజేంద్రా వారి నాతపోధనుడు బ్రతికించినట్లు వింటిని.

క్రూ॥ ఆహా యిదియేమి చిత్ర। మవనిలో నేనెందుజూడ। ఆహుతినొందినవారలు। ఆశ్చర్యము బ్రతుకరేడ॥

వ॥ అయిన రానిమ్ము చూచెదగాక.

శూ॥ వచ్చితె భయమేమియుందు। హెచ్చుబలాఢ్యులము మనము। మచ్చిక తిప్పాయపల్లె। మాధవుడే బ్రోచునుమిము॥

వ॥ మహారాజా మనతో బోరునంతటి బలాఢ్యుండీ లోకంబునగలడా యేల భయము.

(అంత కనకసేనుడరుదెంచి క్రూరునిజేరి).

వ॥ వరే దురాత్మా క్రూరసేనా.

కన - గీ॥ యిన్ని దినములనుండి నీవెన్నొ పాప । కృత్యముల జేసితివిపంద క్రూర సేన । నేడు నీకంత్యకాలంబు మూడెచూడు । రారపాపాత్మ నినుకాలరాచెదనురా॥

వ॥ వోరె యిక నీమదంబడంచి నాయొక్క తండ్రిరుణము దీర్చుకొనియెద నిల్వుంబడుము.

క్రూ - గీ॥ ఆలమునుజేయ కడు పిన్నబాలుడవుర । వారివీరినిగూర్చుక వచ్చి యిందు । నన్నుగెల్చెదనని మురియుచున్న నిన్ను । యేమనందును శరణనియేగుమింకా॥

వ॥ వరె బాలకా నీవింక అస్త్రశస్త్రవిద్యలు నేర్వవలసియున్నది కావున శరణని మరలిపొమ్ము మన్నించెదను.

వాదం - దర్వు.

కన॥ యెంతబలాఢ్యుడ వంతరంగమున । రంతులుబాపెదరా క్రూరా । ఏంతగెంచినే బాలునిసంగతి । యింతలోనజూపింతును నిల్వర॥

వ॥ వరెభ్రష్టా నిన్నుజంపుమని నాచందాద్రియుధము గోడుదెట్టుచున్నది వింటివా.

క్రూ॥ నిలుమానాయొక బలమును గనుగొన । దలచిన జూపెద తప్పకరా । బలుమదమున నీవింకపుమాటలు । బలికిన భయపడబోదునె యీరొయి॥

వ॥ వరె యర్భకా ముక్కుపచ్చలారని పోరడవు సమరనమాచారను నీకేమి గుర్తురా వృథా మరణమయ్యెదవు పొమ్ము.

కన॥ పటుబలశాలివె పారిపోకనీ । విటుగాంచుము నావిక్రమిపుడుగ । కటిలాత్మా నినుగూలగ నేసిన । దిటముగదెల్పెను దుర్మార్గావిను॥

వ॥ మూర్ఖా నీకెల్లకాలము జయమగునా నేటికి నీపాపము నిన్నెజెరుపుచున్నది. వింటివా.

క్రూ॥ యెదురాడిన భయమొదవ నీజనకుని । విధమున నినుద్రుంచెద వినుముగ । పదురకు పెక్కగ మద్భుజబలమును । మదినెరుగవు నీమదమణగించెద॥

వ॥ వోరే నీతండ్రివలె నిన్నుగూడ యమపురికంపిన యిద్దరు యొక్కచోట నుందురుగదరా.

కన॥ వినుమిక నాజనకుని ద్రుంచినవిధ । మోన నినుయమపురికనుపకను । జనుడునెనీయొక జననిజనకులను । మనమున దలుచుకొమన లేవికనూ॥

వ॥ దురాత్మా యిక నిన్నువిడిచిన మేలులేదు కావున నీతల్లిదండ్రుల దలంచుకొనుము నీకు కాలమాసన్నమైనది.

క్రూ॥ యిరవుగ నేనెందరినొద్రుంచితిని । ధర క్రూరుండనబరగితినీ । పరగను శ్రీతిప్పాయపల్లె కరి । వరదుని నామది వాసిగదలచెద॥

వ॥ ఆహా యిదువరకు నేనెందరినో ద్రుంచితినిగాని యీబాలుని సంహారించవలను గాకున్నదే, యిక నేనేమి సేయుదును.

జ - వ॥ కనకసేనా చూచెదవెందుకు యింక వీని నీభూమియందుంచగూడదు సంహారించుము.

(అంత కనకసేనుడు క్రూరుని సంహరించిన విమలాదేవి కనకసేనుంగని).

వి - వ॥ కుమారా యేల యిట్లొనర్చితివి.

క॥ అపకారికి నపకారము । చపలత్వముతోడ జేయ జెల్లదు సెప్పుమీ । నపకారికి నుపకారము । నెపమెన్నక సేయువాడు నేర్పరి తనయా॥

వ॥ కావున నీవిట్లొనర్చుట పాడిగాదు కుమారా.

జ - వ॥ అమ్మా విమలాదేవి పరమపాపాత్ముడగు వానిని దృంచిన నేమిదోషంబున్నది నీకు దెల్యదా.

వి - వ॥ జరిగడచినపని కేమిగాని యిక దహనాదిక్రియలొనర్చుడు.

(అంత కూరసేని దహనము గావించినపిమ్మట జయసింహుడు కనకసేనునితో).

వాదం - దర్వు.

జ॥ సరెను నేటికి । కడు । జయమయ్యెనుగాని నీవు ॥స॥ మరియిప్పుడు సింహాసన । మున గూర్చుండియు రాజ్యము । పరిపాలన జేయుమింక । ప్రజలెల్లను సన్నుతింప॥స॥

వ॥ కావున యిక నీవీసింహాసనమునగూర్చుండి ధర్మప్రపంచంబు నడుపవలయు వింటివా.

కన॥ నాయనమునకూ । మా । నాయన సింహాసనమున ॥నా॥ యేమనందుమీతోడను । యెట్టుదోచదు నాకికయా । ప్రేమయి లేదారయి నింక । పిన్నవాటనౌదుచూడ ॥నా॥

వ॥ అక్కటా యీపట్టాభిషేక మహోత్సవము మాతండ్రియుండి జరిపిన యెంతో ఆనందము నోలలాడుచుండునుగదా.

వి॥ ప్రియనందననీ । వా । భూపాలుని యాజ్ఞతోడ ॥ప్రి॥ యీదొడ రాజ్యంబునేల । నయముగ తిప్పాయపల్లె । పయజాతుండయ్యెన శ్రీ । పరమాత్ముడె బ్రోవగలడు॥ప్రి॥

వ॥ కుమారా కనకసేనా నీవుంగాక యీరాజ్యము పాలించువారెవ్వరు. కావున జయసింహ భూపాలుని యాజ్ఞప్రకారము పట్టాభిషక్తుడవు గమ్మ. నామాటవినుము తండ్రీ.

క - వ॥ అమ్మా తమ యాజ్ఞప్రకారమే మెలగెదను (అనిన కనకసేనునికి పట్టాభిషేకముగట్టి మంగళవాద్యములు వాయించుట).

మంగళహారతి.

మంగళమిదెగొను రామా । శ్రీరామా । జయ । మంగళగుణధామ ॥ మంగళకర సీతాంగనవల్లభ । రంగనయన సారంగవినుత జయ ॥మం॥ సురమునివందిత కరివరదాచ్యుత । మరినీసరియెవ్వరు కరుణారస ॥మం॥ భువిప్రహ్లాదుని బ్రోచుటకొరకై । సవినయముగ నరసింహుడవైతివి ॥మం॥ శ్రీధరమాధవ నీదయరాఘవ । యీధర భక్తజనార్దన శ్రీహరి॥ మం॥ లోకనాథ శుశ్లోకపరాత్పర । ప్రాకటముగ తిప్పాయపల్లె స్థిర ॥మం॥

సంపూర్ణము.

—:o:—

కొండా శంకరయ్యగారి ప్రీమియర్ ముద్రణాలయమున ముద్రింపబడినది సికింద్రాబాద్.

# మా ప్రచురణ చిరుతల నాట్యగ్రంథములు.



| | |
|---|---|
| చిరుతల రామాయణము | వెల 1-0-0 |
| చిరుతల సారంగధర చరిత్రము | 1-0-0 |
| చిరుతల మైరావణ చరిత్రము | 1-0-0 |
| చిరుతల శశిరేఖాపరిణయము | 1-0-0 |
| చిరుతల సంపూర్ణ చంద్రహాస | 1-0-0 |
| చిరుతల అల్లీరాణి చరిత్రము | 0-12-0 |
| చిరుతల రంభా రంపాల చరిత్రము | 1-0-0 |
| చిరుతల కుశలవ చరిత్రము | 1-0-0 |
| చిరుతల భీమాంజనేయము | 0-12-0 |
| చిరుతల శ్రీకృష్ణలీలలు | 1-0-0 |

ఈ పుస్తకములేగాక యింకా మీకు కావలసిన పుస్తకములకు మాకేవ్రాసి తెప్పించుకోగలరు.